ఇతర స్త్రీలపై విపరీతమైన కామ ప్రకోపాలు, ఇంటి ఇల్లాలిపై విసుగు – కోపం, అసహ్యం, కుటుంబ సభ్యుల మధ్యలో ఒకరిపై ఒకరు కీడు చేసుకోవాలని తలచడం, దాడులు చేసుకోవడం, చంపుకోవడాలు, హత్య కావింప బడటం, హత్యలు చేయడం.

దొంగతనాలు, అగ్ని ప్రమాదాలు, అకస్మాత్తుగా సంభవించే ప్రమాదాలు, చర్మ వ్యాధులు, ఉద్యోగం లభించకపోవడం, విదేశాలకు వెళ్ళాలన్నా వెళ్ళలేక పోవడం, ఇతరత్రా.

**ఆడపిల్లల విషయంలో :** ఇతరులను ప్రేమించడం, లేచిపోవడం, పెళ్ళి అయిన తరువాత పూర్వ ప్రేమికునితో కులకడం, పుట్టింటికి చేరుకోవడం, పుట్టింటి వారికి బరువు కావడం, మెట్టినింట కష్టాలు ఎదుర్కొని, భర్త బలవంతంచే పుట్టినింటివారిని పీడించడం.

పై దోషాలను వాస్తురీత్యా సవరించుకోవచ్చు.

నమ్మండి నమ్మకపొండి, ఇలాంటివి ప్రపంచంలో జరుగుతాయా అనే సంఘటనలు కూడా నా అనుభవములో చూడటమైనది. అక్షర రూపంగా వాటిని వ్రాయలేను. అసహ్య కరమైన సంఘటనలను వ్రాయడం మంచిది కాదనే ఉద్దేశ్యంతో అక్షర రూపం చేయలేదు. అయితే వారింట వాస్తు దోషాలు సవరించిన తరువాత అటువంటివి భవిష్యత్తులో జరుగకపోవడం నిజంగా వాస్తు గొప్పతనమే. భగవంతుడు మనకిచ్చిన ఈ వాస్తు సవరణల అవకాశానికి మనస్ఫూర్తిగా, హృదయ పూర్వకంగా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

రెండవది పరిశోధనలు చేసి ఎన్నో సమస్యలకు పరిష్కారాలు సూచించిన వాస్తు శాస్త్రవేత్తలకు కూడా మనస్ఫూర్తిగా, హృదయ పూర్వకంగా కృతజ్ఞతలు తెలుపు కుంటున్నాను. ఈ పరిశోధనలు ఇంతటితో ఆగక బాగా ఎక్కువగా చేసి ప్రజలకు వాటి ఫలములను ఇంతకు ముందులాగే అందించాల్సిందిగా నా హృదయ పూర్వక ప్రార్థన.

ప్రజలకు ఓ ముఖ్య గమనిక ఏమంటే వాస్తు పనిచేస్తుందా లేదా అనే విషయం ప్రక్కన పెట్టి ఏ నిర్మాణమునైనా వాస్తురీత్యా నిర్మించుకోవాలని, తద్వారా అందరూ ఆనందంగా ఉండాలని నా అభిమతము.



*e-book* కొని రచయితను ప్రోత్సహిస్తున్నందుకు మీకు ధన్యవాదములు. వాస్తు శాస్త్రము నేడు ప్రజా బాహుళ్యము పొందినది. భారతదేశంలో అత్యధికంగా వాస్తు శాస్త్రమును పాటించువారు మన తెలుగువారు కావడం మన అదృష్టం. *e-book* లు మాత్రం తెలుగులో మొట్టమొదటిగా *www.subhavaastu.com* నుండి వెలువడటం అత్యంత ఆనందకరమైన విషయం. విదేశాలలో నివసించు మన తెలుగువారి కోసం ప్రత్యేకంగా తయారుచేసినవి ఈ *e-books*. మన తెలుగువారందరిని దృష్టిలో ఉంచుకొని అత్యంత తక్కువ ధరకు ఈ *e-books* ను ఉంచడమైనది. *e-books* ను తయారుచేయడం ఎంత కష్టమో అందరకూ తెలిసినదే. అయితే మనవారి కోసం ఎంతో ఆప్యాయతగా ఓర్పుతో తయారు చేసి మీకు అందించడం జరిగినది. ఈ అవకాశమును మీరేకాక మీ సన్నిహితులు, మిత్రులు, బంధువులకు తెలిపి, సద్వినియోగము చేసుకోగలరు.

ఇట్లు
రచయిత
సురేష్ సిద్ధాంతి.

## వాస్తు విశేషాలు

వాస్తు శాస్త్రం ఈనాటిది కాదు. ఇది పూర్వ కాలము నుండియే వాడుకలో ఉన్నది. అయితే సమాచార విప్లవం ఈనాడు ఉన్నంతగా ఆనాడు లేదు. సమాచార విప్లవం నుంచి నేడు వాస్తు జన ప్రాచుర్యం పొందినది.

ఈశాన్యంలో గుంత, ఆగ్నేయంలో మంట, నైరుతిలో పంట, వాయవ్యంలో పెంట ఈ నాలుగు విషయాలు తెలిసిన తోడనే భుజానికి ఒక బ్యాగు తగిలించుకొని మేము వాస్తు చెబుతామని కొందరు బయలుదేరారు. ఇదే వాస్తు పేరు చెప్పి అనేక మంది మోసగాళ్లు ప్రజలను రక రకాలుగా భ్రమింప చేసి ధనం దండుకుంటున్నారు. అమాయకులైన జనం చాలా మంది వీరి చేతిలో మోసపోతున్నారు. నిజమైన వాస్తు శాస్త్రవేత్త ఏనాటికీ ఎవ్వరినీ మోసం చేయడు. అతనికి కీర్తి ముఖ్యము. ధనం ప్రాధానము కాదు. అందువల్ల విజ్ఞులైన మీరైననూ ఒక అనుభవజ్ఞుడైన వాస్తు శాస్త్రవేత్తచే మీ గృహాలను పరిశీలింప చేయించుకొని సుఖ పడుదురని పూర్తీగా విశ్వసిస్తున్నాను.

గృహము యందు వాస్తు దోషములు ఏవైనా ఉన్నచో వాటిని మనం సవరించుకోవడానికి అనుకూలం, అవకాశము వుంది. ఎందుకంటే మన ఆస్థులు కాబట్టి మనము వాస్తు దోషాలను సవరణలు కావించి మంచి ఫలితాలను రాబట్టు కోవచ్చు. అయితే గృహము బయట వాస్తు పరిస్థిలు కూడాను మనపై విపరీతమైన పరిణామములను ప్రసరింపచేయును. దీనిని పరిసర వాస్తు అని తెలుపుదరు. పరిసర వాస్తులో ఎన్నో విషయాలు దాగి వున్నాయి. సాధారణంగా చాలా మంది గృహము యందలి వాస్తును మాత్రమే గమనించి ఏవైనా తమకు తెలిసిన సవరణలు మాత్రం సూచిస్తారు. ఇక్కడ ముఖ్యంగా ఒక విషయాన్ని మనం తప్పనిసరిగా పరిగణలోకి తీసుకొనవలెను. అదియే పరిసర వాస్తు. పరిసర వాస్తు ప్రభావము గృహముపై ఏ మాత్రము వుండదని కొందరు తెలిపి వుండవచ్చు. అయితే ఈ విషయం పూర్తీగా తప్పు. పరిసర వాస్తు తన ప్రభావమును గృహముపై చూపిస్తూ వుంటుంది. గృహము బయట ఏదైనా వాస్తు సవరణలు చేయాలంటే మన ఆస్థులు కానందు వల్ల వాటిపై మనకు అధికారము వుండదు. ఇందుకు వాస్తు శాస్త్రం సమ్మతమైన ఓ పరిష్కార మార్గాన్ని సూచించినది. అదియే బ్యాలెన్సింగ్ మెథడ్స్. పరిసర వాస్తులో ఈ విషయాలన్నీ వస్తాయి. 1. వీధులు, 2. వీధిపోట్లు, 3. పల్లము, తగ్గులు, సరస్సులు, కొలనులు, కాలువలు, 4. గుట్టలు, మిట్టలు, భారీ భవంతులు, సెల్‌ఫోన్ టవర్లు.

## ఈశాన్యము

ఈశాన్య భాగము గురించి **"శుభవాస్తు"** వాస్తు పుస్తకములో పూర్తీ వివరంగా తెలపడమైనది. ప్రత్యేకించి చాలా మంది పాఠకులు ఈశాన్యము గురించి చాలా వివరంగా వ్రాసినందుకు అభినందించారు. వాస్తు శాస్త్రంలో ఈశాన్య భాగమునకు ఒక విశిష్ట స్థానము కలదు. వాస్తు అంతయూ ఒక ఎత్తు, ఈశాన్యము ఒక ఎత్తు. ఈశాన్యము అనగా ఈశ్వరునిలో ఒక భాగమని చెప్పుకోవచ్చు. ఆదిదేవుడైన పరమేశ్వరుని శక్తి గురించి చర్చించడమంటే సామాన్య విషయం కాదు. అలాగే ఈశాన్య భాగము యొక్క గొప్పధనం గురించి చెప్పాలన్నా చిన్న విషయం కాదు. ఇక్కడ మనం క్లుప్తంగా ఈశాన్య భాగము గురించి చర్చించుకుందాము.

చింతల చెరువులో సోమయ్య అను ఒక వ్యక్తికి లక్ష రూపాయలు అప్పు ఉన్నది. అతని ధ్యాస అంతయూ ఆ లక్ష రూపాయల అప్పును ఎలా తీర్చాలనే. ఈ ఆలోచనలతో, కాని పనులతో సతమతమై అనేక రీతులా నలిగి పోయెడివాడు. ఏమి చేసిననూ ఈ అప్పు తీరెడిది కాదు. ఎలాగైననూ ఈ అప్పులు తీర్చాలని పట్టుబట్టి అనేక

రీతులా సర్వశక్తులూ ఒడ్డీ పోరాడినా అప్పు మాత్రం తీరెడిది కాదు. 8 సంవత్సరాలుగా పోరాడుతూనే వున్నాడు. కుటుంబ జీవనం మాత్రం జరుగుతున్నది. తెచ్చిన సంపాదన అంతయూ కుటుంబ పోషణకు లక్ష రూపాయల వడ్డీకే సరిపోతున్నది. చింతతో మనిషి శుష్కించిపోసాగాడు. ఒకానొకనాడు గృహము యందలి పెరటిలో మొక్కలకు పాదులు తీస్తుండగా హఠార్తుగా పనిముట్టుకు భూమిలోపల ఏదో తగిలి శబ్దమైనది. ఆ శబ్దం విచిత్రంగా తోచడంతో వెంటనే చకచకా త్రవ్వి చూడగా అక్కడ ఒక చిన్నపాటి లంకె బిందె దొరికినది. గుండెలు దడదడా కొట్టుకుంటుండగా ఒక్క ఉదుటున గృహములోకి లంకె బిందెతో పరుగులంఘించుకున్నాడు. హడావిడిగా భార్యను కేక వేసి దేవుని గదిలోకి వెళ్లి దేవుడి ముందర లంకెబిందెను పెట్టి దేవునికి మ్రొక్కి లంకెబిందెను తెరవడానికి ప్రయత్నం చేస్తున్నంతలో భార్య రావడము సహాయము చేయడము జరిగి లంకెబిందె మూత ఊడి అందు నుండి గలగలా, జలజలామంటూ బంగారు నాణాలు రాలిపడ్డాయి. భార్యాభర్తలిరువురు ఒక తెలియని మహాద్భుతమైన ఆనందానికి లోనై చేతి నిండుగా నాణాలను తీసుకున్నారు. వారు ఆనందం నుంచి తేరుకొని ఇహలోకంలోకి రావడానికి గంట సమయం పట్టింది.

ఇక ఇరువురూ కూర్చొని ఆ నాణాలను లెక్కబెట్టుకొని ఎవరికీ తెలియకుండా పక్కనున్న నగరానికి వెళ్లి తెలిసిన వారి ద్వారా బంగారు వర్తకుని దగ్గరకు వెళ్లి రహస్యంగా నాణాలను అమ్మారు. వారి చేతికి ఖచ్చితంగా లక్ష రూపాయలు వచ్చినది.

వెంటనే తమ గ్రామమునకు వెళ్లి బాకీ ఉన్నచోట లక్ష రూపాయలను కట్టి సంతకం పెట్టిన ప్రో నోటును ఇంటికి తీసుకు వచ్చారు. ఆ దినం వారి మనస్సు మనస్సులో లేదు. ఎన్ని సంవత్సరాల నుంచో తగులుకున్న దరిద్ర్యం నేటికి తీరినది. భార్యాభర్తలు ఇరువురూ ఈ విషయాన్ని పదే పదే పదే పదే తలుచుకొని మనస్సు సంతోషంతో నిండగా హృదయానందంగా ఎగిరి గంతులు వేస్తూ ఇల్లంతా కలియ తిరుగుతూ ఎగుర సాగారు. వారికి ఈ ప్రపంచాన్ని జయించినంత సంబరం ఆవరించింది.

వారు ఎవరినీ జయించలేదు. వారికున్న అప్పులు మాత్రం తీర్చారు. ఇక వారికి అప్పు లేదు. ఇక ఎవరికీ భయపడాల్సిన పని లేనే లేదు. ఉన్నదంతా తృప్తి, మానసిక ఆనందం.

పై చెప్పుకున్నదంతయూ కేవలము మనిషికి లభించే తృప్తి యొక్క విలువను మాత్రమే. మామూలుగా తృప్తి, మానసిక ఆనందం అంటే ఏమిటో తెలియక పోవచ్చు. అయితే ఒక పెద్ద సమస్య నుంచి బయట పడినప్పుడు లభించిన ఆనందాన్ని వర్ణించడానికి మాటలు రావడము కూడా కష్టము అని చెప్పవచ్చు.

ఖచ్చితంగా ఈశాన్య భాగము బాగా ఉంటే మనిషి జీవితంలో ముందు చెప్పుకున్నటువంటి తృప్తి ఆవరించి ఉంటుంది. అది ఈశాన్యము యొక్క గొప్పదనము.

ఈశాన్యము బాగుంటే రాజులు అవుతారనడం, చక్రవర్తులు అవుతారనడం, ప్రెసిడెంటు, ప్రైమినిష్టర్ అవుతారనడం సరికాదు. ప్రధాన మంత్రికి వున్న సమస్యలు చిన్నవి కాదు. ఆ స్థానంలో వున్న వారికి మాత్రమే ఆ సమస్యల శక్తి ఎటువంటిదో తెలుస్తుంది. బహుశా మనకు తెలియక పోవచ్చును. ఈశాన్య భాగము యొక్క శక్తిని చెప్పుకోవడానికి పదాలను వెదుక్కోవాల్సి వస్తుంది.

ముఖ్యంగా ఈశాన్యము అంటే తృప్తి అని భావించాలి. లేదా మానసిక ఆనందం అని భావించాలి.

**మీకు ఈశాన్యము కలిసి వచ్చిందంటే అదృష్టం కలిసి వచ్చినట్లే. ఈ విషయాన్ని పదే పదే గుర్తుకు తెచ్చుకోవాలి.**

మనము ముందు చెప్పుకున్న కథ కూడా ఒక తృప్తి గురించి చెప్పుకున్నదే. అంతేకాని లంకెబిందెలు, బంగారు నాణాలు గురించి కాదు.

ఈశాన్యము పెంచుకోవడము అనేది అనుభవజ్ఞులైతే చాలా సులభముగా సరళమైన రీతిలో మీకు బోధిస్తారు. నా అనుభవంలో నేను ఎన్నియో సంఘటనలను చూశాను. అదృష్టము ఉన్న వారు మంచి అనుభవం గల వాస్తు శాస్త్రవేత్తలను పిలుచుకు వచ్చి తమ గృహాలను పరిశీలింప చేయించుకొని భాగ్యాన్ని పొందుతారు. ఈ అదృష్టవంతులు వాస్తు శాస్త్రవేత్తకు ఇచ్చే రుసుముకు ఏ మాత్రమూ జంకరు. కారణం వీరికి అదృష్టాన్ని మోసే సమయము ఆసన్నమై వుంటుంది. అదే దురదృష్టవంతులు ఎంత కాలమూ వాస్తు శాస్త్రవేత్తకు ఇచ్చే రుసుము గురించే యోచన చేస్తూ కాలాన్ని వెల్లదీస్తూ కాల గమనంలో కలిసిపోతూ వుంటారు. ఇది చూడండి.

ముంబాయి మహానగరంలో ఒక సాఫ్ట్‌వేర్ కంపెనీ ఎం.డి నన్ను వాస్తు చూడాలని పిలిపించారు. ఆ కంపెనీ పార్ట్నర్‌కు నన్ను పిలవడము సుతరామూ ఇష్టము లేదు. అతను మొహం చిటపటలాడిస్తూనే వున్నాడు. మాతో ఎవ్వరితో కూడానూ సరిగా మాట్లాడలేదు. దాదాపుగా మధ్యాహ్నం ఒంటి గంట కావొస్తున్నది. అప్పుడు నన్ను పిలిపించిన వ్యక్తితో పార్ట్నర్ గొడవకు దిగాడు. ఈ వాస్తు అంతా ఏమిటి, ఇది ఎవరు చెప్పొచ్చారు, ప్రతి ఒక్కరూ వాస్తు చూపించుకొనే బాగుపడుతున్నారా! సౌత్ ఇండియా నుంచి వాస్తు శాస్త్రవేత్తను పిలిపించడము అంత అవసరం వుందా. ఇలా మాట్లాడుకుంటూ మాట్లాడుకుంటూ ఒక అరగంటలోపే ఇరువురూ కాస్త కటువుగా వ్యవహరించుకొని నేను అక్కడ ఉండగనే విడిపోవటము జరిగినది. విడిపోతున్న పార్ట్నర్‌తో నేను ఎంతో మర్యాదపూర్వకంగా అభ్యర్థించి కలిసి వుండండి, ఇక మీ కంపెనీ మంచి లాభాల బాటలో పడుతుంది అని ఎంతగా చెప్పినా తలకెక్కించుకోక నన్ను కూడా రెండు మాటలని, ఎం.డి. గారితో మిగతా విషయాలన్నీ సాయంత్రం ముగించుకుందామని తెలిపి తన సొమ్ము తనకు ఒక నెల దినముల గడువులో ఇచ్చి వేయమని కరాఖండిగా తేల్చి చెప్పి అటునుంచి తన దారిలో తను వెళ్లి పోయాడు. వారి ఆఫీసు పటం నమూనాను చూడండి.




నన్ను పిలిపించిన సాఫ్ట్‌వేర్ ఆఫీస్ వారికి ఈశాన్యములో టీస్టాల్, తూర్పు ఆగ్నేయమున ద్వారములు కలవు. వారు ఊహించిన ఫలితాలు రావడం లేదు. పైగా ఏదో ఒక వ్యవహారం నెత్తికి చుట్టుకుంటున్నది. ఈశాన్యము కలిసి వస్తుందనే ఉద్దేశ్యంతో పార్ట్నర్‌ను బయటకు వెళ్లక కంపెనీతోనే వుండమని నేను కోరాను. ఆయనకు కాలం మంచిగా లేదు. అందుకే ఈ కంపెనీని వదిలి తర్వాత కాలంలో ఇంకో కంపెనీని వీరి ప్రక్కనే ఏర్పాటు చేసుకున్నాడు.




నన్ను పిలిపించిన వారికి ఈశాన్యము పెరగడముతో పైగా ఈశాన్యము నడక రావడముతో అద్భుతమైన ఫలితాలను రుచి చూశారు. ఏమంటే ఈ టీ స్టాల్‌ను కొనడం మాత్రం ఎక్కువ ధర పడింది. అయిననూ అదృష్టము ఊరక రాదు. ఈ రహస్యం తెలిసిన వాడు కాబట్టే వాస్తు శాస్త్రం యొక్క సహాయాన్ని అర్థించి లాభ పద్దాడు.

అంత కాలం కంపెనీలో ఉండి బయటకు వెళ్లిన పార్ట్నర్‌కు కలిసి రాలేదు. కారణం తూర్పు ఆగ్నేయ ద్వారము. పార్ట్నర్ కంటి ముందరే వీరు ఎదిగిపోతున్నారు.

ఈశాన్యము పెరిగితే జరిగే లాభాన్ని గమనించాలి. ఈశాన్యము పెరగడము అనగా అదృష్టము పెరగడమే. దురదృష్టవంతులు ఈశాన్యము పెరిగిన స్థలములో ఉండలేరు. వారి చెడ్డ సమయం వారిని ఈశాన్యము పెరిగిన స్థలములో వుంచనివ్వదు. ఏదో తెలియని ఒక శక్తి చెబుతున్నట్లుగా వారు తప్పు నిర్ణయాన్ని తీసుకుంటారు. అందుకే పార్ట్నర్ కంపెనీ నుంచి విడిపోయాడు. కొద్ది కాలం ఓపిక పట్టి ఉంటే అతనికీ అదృష్టములో భాగము లభించేదే.

టీ స్టాల్‌ను ఒక ముదుసలి నడుపువాడు. అతనికి మంచి ఆఫర్‌ను సాఫ్ట్‌వేర్ కంపెనీ వారు ఇవ్వడముతో ఆనందంగా అటునుంచి వెళ్లి పోయాడు. అతనికి ఏ మాత్రమూ స్థలం వదులుకుంటున్నందుకు బాధ మచ్చుకు కూడా లేదు. దొరికిందే అదృష్టంగా భావించాడు.

మీ నిర్ణయం మీ జీవితాన్ని మారుస్తుంది. అయితే నిర్ణయం తీసుకునే దాంట్లో వుంది. బాగా యోచన చేయండి. అదృష్టం కావాలో, దురదృష్టాన్ని అలాగే మోస్తూ వుండాలో తేల్చుకోండి. వాస్తు శాస్త్ర సహాయాన్ని బాగా పొందండి. వాస్తు శాస్త్రాన్ని నమ్మి చెడిన వారు లేరు. అయితే వాస్తు శాస్త్రవేత్తను ఎంచుకునే దాంట్లోనే మీ భవిష్యత్తు ఆధారపడి వుంటుంది.

మీరు ఈశాన్యమును పెంచుకొని అభివృద్ధి అంటే ఎలా ఉంటుందో రుచి చూడవచ్చు. ఇన్ని సార్లు ఈశాన్యము గురించి చెప్పడానికి కారణం ఈశాన్యము యొక్క బలము అత్యంత ప్రశస్తమైనది మరియు బహు గొప్పది.

మీ గృహము బయట ఈశాన్య భాగమున బావి గానీ, గుంతలు గానీ, చిన్న పాటి కొలను గానీ ఉంటే దాని ఫలితాల గురించి ఇప్పుడు తెలుసుకుందాము. ప్రతి ఒక పనిలోను మీకు కలిసి రావడం, మృష్టాన్న భోజనము ఆరగించిన తరువాత వచ్చే తృప్తి ఎలా ఉంటుందో అటువంటి తృప్తి మీకు ఎప్పుడూ కలుగుతూ ఉంటుంది. ఒక విజయాన్ని సాధించిన ఆనందం ఎలా ఉంటుందో అటువంటి ఆనందం మీలో మిళితమై ఉంటుంది. ఎప్పుడూ

హుషారుగా, ఆనందంగా, సంతోషంగా ఉంటారు. మగ పిల్లల జననం కలుగుతుంది. ఆడపిల్లల జననం ఎక్కువ ఉన్నవారు మరియు మగ సంతానం కావాలని కోరుకొనే వారికి ఇటువంటి గృహముల యందు వారి కోరికలు ఫలిస్తాయి. అయితే ముఖ్య గమనిక ఏమంటే గృహములో గానీ, ప్రహరీలోగాని ఈశాన్య దోషాలు ఏమాత్రం ఉండకుండా చూసుకోవాలి. ఈశాన్యం పెరిగి ఉండడం వల్ల సిద్ధి. కుటుంబ సభ్యులందరికీ ఆరోగ్యము బాగుంటుంది. భోగభాగ్యాలు, సిరి సంపదలు, సంతోషము, ఆనందము, సౌభాగ్యము, అభివృద్ధి.

పిల్లలు చదువుల యందు చక్కటి అభివృద్ధిని కనబరచి వారు చదువుతున్న పాఠశాల యందు ఒక గుర్తింపును పొంది ఉంటారు. వీరు చదువుతున్న తరగతిలో గురువు ఏకాగ్రత ఎక్కువగా వీరిపై ఉండి ప్రత్యేక శ్రద్ధ కనబరుస్తారు. వారు ఆశించిన రీతిలో వీరు ఎదుగుతారు. మంచి మార్కులు పొంది ఇతరులకు ఆదర్శప్రాయము అవుతారు. సైన్సు ఫేర్‌లు, ఆటపాటల పోటీలయందు, ఇతర కాంపీటీషన్ల యందు వీరు ముందుండి సాధారణంగా మొదటి బహుమతులను  పొందుతారు. కాస్త ఇతర పిల్లల అసూయ ద్వేషాలు వీరిపై ఉంటాయి. అయితే అవి ఏమాత్రమూ వీరికి ప్రమాదకరంగా తయారుకావు. ఒకవేళ వీరికి కీడు తలపెట్టవలనని అసూయ కలిగిన పిల్లలు ప్రయత్నం చేసిననూ వారి ప్రయత్నాలు ఫలించవు. పైగా ఇతరులకు దొరికిపోయి అవమానింపబడతారు. పిల్లలకు విదేశీ యోగం, విద్యకై, ఉద్యోగము కొరకై విదేశాలకు వెళ్ళడం జరుగుతుంది. గృహము బయట ఈశాన్యముయందు గుంతలు కలిగిన గృహముల వారికి ఏదైనా ఫ్యాక్టరీలు ఉన్నచో వాటియందు మంచి లాభములు వచ్చి పనివారు ఎదురు తిరగక చక్కగా అనుకూలించి ఇతోధికంగా సహాయపడే అవకాశం ఎక్కువ. ఇటువంటి ఫ్యాక్టరీల యజమానులకు సిస్టర్ కన్‌సర్న్ ఏర్పడతాయి.  వాటియందు కూడానూ అనేక విధాలా అనుకూలము.

ఒకవేళ రాజకీయ రంగంలో ఉన్నవారికి మంచి పదవులు లభించి పార్టీ యందు ఒక ప్రత్యేక గుర్తింపు, వీరి మాటకు విలువ వుండడము, అడగకనే వచ్చే బహుమతులు, బట్రాజులు ఏర్పడటము, వీరి ద్వారా ప్రత్యేకమైన లాభములు, వాహన సౌఖ్యము, దీనికి అయ్యే ఖర్చు అప్పణంగా లభించడము. వ్యాపార రంగములో ఉన్న వారికి ఇతోధికంగా ధనము కూడటము, తోటి ఇతర వ్యాపారస్థుల మధ్యలో గుర్తింపు, వ్యాపార సంఘములో ఒక పదవి, అక్కడ కూడా గుర్తింపు, మాటకు గౌరవము ఇతరత్రా. ఆడవారికి ఆరోగ్యము బాగుండి, ఇంటిపనులు చాలా సజావుగా చేసుకుంటూ ఏ మాత్రము కష్టమనేది లేకుండా సుఖజీవనాన్ని పొందుతారు. భర్త మరియు పిల్లలకు సంఘంలో లభించిన గౌరవ ఫలితములను వీరుకూడా సమ భాగస్తులై అనుభవించే అవకాశము ఉంటుంది. ఇతర స్త్రీలు మరియు సంఘము యందలి జనులు గౌరవాన్ని ఆపాదిస్తారు.

**దుష్ఫలితాలు :-** ఒకవేళ గృహము బయట ఈశాన్య భాగములో ఎత్తైన అంతస్థులు, మాడీలు, అపార్ట్‌మెంట్‌లు, సెల్‌ఫోన్ టవర్లు, కొండలు, గుట్టలు, మిట్ట, మిద్రుగా ఉండటము, ఇంట ఈశాన్య లోపాలు ఉంటే, నయము కాని రోగాల బారినపడటము, అలర్జీలు, పక్ష వాతము, కానిపనుల కోసం ఎక్కువగా ప్రయత్నాలుచేయడం, ఉన్న సమయమంతా వాటికై వెచ్చించడం, పదిమందిలో నవ్వుల పాలు కావడం, వ్యాపార నష్టాలు, ధననష్టము, పేరు నాశనము కావడము, సంఘంలో గుర్తింపు తొలగిపోవ డము, కుల సంఘాలలో భ్రష్టు పట్టిపోవడము, చిన్నపాటి తప్పుకే అందరి మధ్యలో అవమానింపబడటము, నోరు పెగిలి మాట సరిగా రాకపోవడము, ఆడపిల్లల సంతానము, ఉన్న మగ పిల్లలు అభివృద్ధిలోకి రాక  జులాయిలతో తిరిగి భ్రష్టుపట్టి కుటుంబ సభ్యులకు అప్రతిష్ట తేవటం, ఏమాత్రం యోగ్యత లేకపోయినా ప్రేమ అంటూ అమ్మాయిల చుట్టూ తిరగటం, అమ్మాయిల తల్లి దండ్రులతో అవమానింప బడటం, విద్యా నాశనం.

## తూర్పు

**తూ**ర్పు రవి ఉదయించు స్థానము. జ్ఞానము, శక్తి, ధైర్యము. దైవము, వెలుతురు, ఆరోగ్యము, కీర్తి, ధనము, ప్రతిష్ట జనియించు స్థానము.

తూర్పును చాలా మంది తేలికగా కొట్టి పారేస్తారు. అయితే తూర్పుకు ఈశాన్యములో అర్థము శక్తి ఉన్నట్లే. చిన్నచూపు చూడటం తగదు. తూర్పు భాగమును గృహములో చక్కగా ఏర్పాటు చేసుకొని ఏ పొరపాటు లేకుండా బాగా ఉన్నచో యోగం మొదలైనట్లే.

ముఖ్యంగా ఈ తూర్పు దిశ వల్ల మగవారికి, రాజకీయ వేత్తలకు, వ్యవహారములలో చిక్కుకొని తలమునకలయ్యే వారికి, శత్రుపీడ కలిగిన వారికి, చెడుపేరు గల వారికి, పిల్లలకు విద్య సరిగా రాని వారి గృహాలకు తూర్పు భాగము దోషాలను సరి చేసినచో బాగా కలిసి వస్తుంది. తూర్పు దిశ బాగుంటే దశ మొదలైనట్లే. గృహములో నాలుగు మూలలు, నాలుగు దిక్కులు ఉంటాయి. వేటికవే ప్రత్యేకమైన శక్తులను కలిగి వుంటాయి. ప్రతి ఒక మూల మరియు ప్రతి దిశ సరిగా ఉన్నచో యోగవంతమైన జీవితము ప్రాప్తించును.

మన గృహమునకు బయట తూర్పు భాగములో పల్లము ఉండడం, బావి ఉండడం, గోతులు ఉండడం, చిన్నపాటి కొలను ఉండడం తదితరములు ఉన్నచో గృహస్థులకు రాజభోగము, కీర్తి ప్రతిష్ఠలు, సంఘములో, కులసంఘములలో, సమాజములో ఒక గుర్తింపు, మాటకు విలువ, చెప్పిన మాటకు కట్టుబడి పనిచేసేవారు ఎక్కువ కావడం, ధనాదాయం, వ్యాపార అభివృద్ధి, రెండవ వ్యాపారము కూడా స్థాపించడం, అందుకూడా అభివృద్ధి, పిల్లల చదువు బాగుండడం, ఇంటి వాస్తు కూడా అనుకూలిస్తే విదేశీయోగం, ఇంటిల్లిపాదికి ఆరోగ్యము బాగుండటం, భర్త మాటను భార్య బాగా గౌరవించడం, కుటుంబము యందు కలహములు లేకపోవడం, బంధుమిత్రుల రాకపోకలు, వారి మధ్య కుటుంబ సభ్యులకు మంచి పేరుండటం, ఇతరత్రా.

**అశుభ ఫలితములు :-** తూర్పు భాగములో గృహము బయట కొండగానీ, గుట్టగానీ, ఎత్తైన అంతస్థులు గల భవనము గానీ, లేదా సెల్‌ఫోన్ టవరు గానీ లేదా బ్రిడ్జ్ గానీ, అపార్టు మెంట్లుగానీ, ఎత్తైన రోడ్లు ఇతరత్రా గానీ ఉన్నచో ఇంట తూర్పు చెడినచో గృహస్థులు అనేక బాధలు అనుభవించాల్సి ఉంటుంది. ధన నష్టము, సంఘములో పరువు పోవడం, అనా రోగ్యము, విద్య సరిగా రాకపోవడము, ఇంటిలో ఎప్పుడూ చికాకులు, టెన్షన్లు, మనశ్శాంతి లేకపోవడము, భయంగా ఉండడము, భార్యను సుఖపెట్టలేకపోవడం, కుటుంబ సభ్యులకు న్యాయం చేయలేకపోవడం, ఇంటిలో ఎప్పుడూ కటకట, అనవసరమైన విషయాలకై సమయాన్ని వెచ్చించడం, ఇతరుల అంగళ్ళ దగ్గరకు వెళ్ళి వారితో మాట్లాడుతూ సమయాన్ని వ్యర్థం చేసుకోవడము, సమయ పాలన పాటించక పోవడం, శుభ్రత గురించి ఆలోచన చేయకపోవడం, నోటిలో దుర్వాసన, అల్సరు, శుభ్రత కలిగిన దుస్తులను ధరించకపోవడము లేదా మలినమైన దుస్తులను ధరించి అలాగే బజారుకు వెళ్ళడం, ఏ విషయంపై కూడా ప్రత్యేకమైన శ్రద్ధ కనబరచక పోవడం, పిల్లలపై అనవసరంగా కేకలు పెట్టడం తదితరములు.


*e-mail : subhavaastu@rediffmail.com,* ***Web Site : www.subhavaastu.com***

**రచయిత : సురేష్ సిద్ధాంతి. ఫోన్ : 98481 14778**

## ఆగ్నేయము

ఆగ్నేయము అనగానే అగ్ని గుర్తుకు రాక మానదు. అగ్నిని వాడుకునే దాంట్లోనే మన తెలివితేటలు బయట పడతాయి. మనము తెలివిగా అగ్నిని వాడుకున్నందువల్లే ఇంత అభివృద్ధిని సాధిస్తున్నాము. అదే అగ్నిని వాడుకోవటం మనకు తెలియకపోతే ఇంతటి అభివృద్ధి మానవులకు లభించడము కష్టం.

అగ్ని వల్ల ఉపయోగం ఉంది, ప్రమాదమూ ఉంది. అంతా మనం వాడుకునే దాంట్లోనే వుంటుంది. స్నేహపూర్వకంగా అగ్నిని వాడితే మనకు కావలసిన పనులన్నియూ సులభతరంగా ముగుస్తాయి. అదే అగ్నిని వికృతంగా వాడితే బూడిదే.

చలికాలం ఉదయాన్ని గుర్తుకు తెచ్చుకోండి. ఉదయం 5 గంటల సమయంలో అక్కడక్కడా రహదారులపై కొందరు అగ్నిని వేసుకొని చలి నుంచి కాపాడుకుంటూ వుంటారు. అయితే ఆ అనుభూతి మాత్రం అనుభవించే వారికి మాత్రమే తెలుస్తుంది. నులివెచ్చని ప్రకంపనలు మనకు చలి గల వాతావరణంలో తాకుతూ వుంటే ఆహా ఏమి హాయి, అనుభవించే వారికే స్వంతం. ఇతరులకు ఊహాప్రాయం. ఇప్పటికీ గ్రామాలలో ఇటువంటివి అనుభవపూర్వకంగా అనుభూతిని పొందవచ్చు. అదే పట్టణాలలో ఇటువంటివి అన్నీ రాతలలోనే చూసుకోవలసి వుంటుంది.

చలి ఎక్కువగా వుండి మంట తక్కువగా వుంటే వేడి లభించదు. అనుభూతి తగ్గుతుంది. అదే ఎక్కువ వేడి కావాలనుకుంటే అగ్నిని కాస్త పెరిగేలా చూసుకుంటాము. అంతేకానీ ఆ అగ్ని పై మనము కూర్చోము కదా! ఎందుకు కూర్చోము. అది జ్ఞానము. అదే అగ్నిని వాడుకొనే విధానము. అలాగే వాస్తు శాస్త్రంలో కూడా ఆగ్నేయమును తెలివితో వాడుకోవాలి. అగ్నితోనూ, ఆగ్నేయము తోనూ ఆటలు పనికి రావు. అగ్నిని వాడుకుంటే ఎంతటి శుభ ఫలితాలు పొందుతామో, అలాగే ఆగ్నేయమును వాడుకున్ననూ అంతటి శుభ ఫలితములను పొందుతాము.

గృహము బయట ఆగ్నేయ భాగములో పల్లమున్నచో, గుంతలు, బావులు, కొలనులు ఉన్నచో శుభ ఫలితములు కాక అశుభ ఫలితాలు ఎక్కువగా ఉంటాయి. ఈ గృహము వారికి ఈశాన్యము బాగుంటే ఇతరులను మోసము చేయడం, పరాయి స్త్రీలపై మోజు అధికంగా ఉండడం. ఈశాన్యము సరిగా లేకపోతే మోసగింపబడటం, చివరికి ఆడవారి చేతిలో కూడా మోసపోవడము, పరాయి స్త్రీలపై విపరీతమైన కామవాంఛలు, వారిని అనుభవించాలనే ఆలోచనలు అధికం కావడం, వాటికై ప్రయత్నాలు, ఒక్కొక్కసారి ఇతరులకు దొరికిపోవడం, వారు భయపెట్టి బలవంతముగా ధనము గుంజడం, వారి ఇతర పనులన్నీ చేయించుకోవడము, భార్య చక్కని చుక్క అయిననూ పరాయి స్త్రీలపై మోజు తగ్గకపోవడము, ఎటుతిరిగి పరాయి స్త్రీతో సంగమించడము, అయిననూ తృప్తి తీరక ఇతర స్త్రీల కొరకు ప్రయత్నాలు చేయడం, మద్య సేవనము, మాంసాహారం భుజించడం, విపరీతమైన కోపాన్ని కలిగి ఉండడం, కొన్ని సమయాలలో భార్యను చితకబాదటం, భార్య ఎదురుతిరిగి దొరికిన గుంజతో కీళ్ళు విరగగొట్టడం, ఇతర పురుషుల సహాయంచే చావగొట్టించడం, బంధువుల మధ్యలో భర్తకున్న పేరును నాశనం చేయడం, అతను చేస్తున్న పనులన్నిటినీ బయటకు చెప్పడం, అవిద్య, పరిష్కారము కాని సమస్యల ఉచ్చుల్లో చిక్కుకోవడం, తదనంతరం దాని పరిష్కారం కోసం యోచన చేసి చేసి ఉన్న జుట్టును అంతా ఊడగొట్టుకోవడం, కీళ్ళ నొప్పులు, అన్ని ప్రభావాలు ఎక్కువగా కాక కాస్త తక్కువగా ఉంటాయి. కొన్ని పరిస్థితులలో అగ్ని ప్రమాదాలు, ఆక్సిడెంట్లు, కాళ్ళు చేతులు విరగడం, విపరీతమైన ఆకలి, బాగా లావుకావడం, బొజ్జ పడడం, ఇతరత్రా. గృహము బయట ఆగ్నేయ భాగమునందు గుట్టలుండడం, కొండలుండటం, బహుళ అంతస్థులు ఉండడం, ఇతరత్రా ఉంటే దరిద్రము, ధననష్టము, ఉన్న డబ్బంతయూ జారిపోవడం తదితరములు.

## దక్షిణము

**ద**క్షిణానికి యముడు అధిపతి. వాహనము దున్నపోతు. జ్యోతిష శాస్త్ర రీత్యా దక్షిణానికి కుజ గ్రహము ప్రాధాన్యత వహిస్తుంది. చాలా మందికి కుజ గ్రహం యొక్క శక్తి తెలియకపోవచ్చు. ప్రస్తుతం మనం కుజ గ్రహం యొక్క శక్తిని గురించి కాస్త తెలుసుకుందాము. ఎంతంటే మన రాజకీయ నాయకులలో కొందరు సేవ చేస్తామని భయంకరంగా సమాజాన్ని దోచుకు తింటున్నారు. వారి గురించి మనకు తెలిసింది కొంత మాత్రమే. అటువంటి కొంతనే మనము ఇప్పుడు తెలుసుకుందాము.

శని గ్రహము మహాశక్తిమంతమైనది. నవ గ్రహాలు 9. ఒక శాస్త్రం ప్రకారం నవ గ్రహాలు మొదట 8 మాత్రం ఉండేవట.

1. గురు, 2. చంద్రుడు, 3. సూర్యుడు, 4. కేతు, 5. శని, 6. బుధ, 7. శుక్ర, 8. రాహు, వీటిలో గురు వర్గం మరియు శని వర్గంగా విడిపోయాయి. గురు వర్గానికి గురు, చంద్రుడు, సూర్యుడు, కేతు ఈ నాలుగు గ్రహాలు ప్రాధాన్యత వహిస్తాయి. ఇక శని వర్గానికి శని, బుధ, శుక్ర, రాహువులు ప్రాధాన్యత వహిస్తాయి. గురు గ్రహము అత్యంత సౌమ్యమైన గ్రహము. శని గ్రహము విపరీతమైన శక్తి కలిగి ఉండెను. శని శక్తి ముందు గురువు యొక్క శక్తి ఏ మాత్రం సరిపోయెడిది కాదు. శని శక్తిని ఒకసారి రుచి చూసిన భగవంతుడు శని యొక్క శక్తినంతటిని లాగివేసెనట. మరియు గురు గ్రహమును రక్షించుట కొరకు ఒక గ్రహాన్ని తోడు ఇవ్వాలని తలచి కుజ గ్రహాన్ని సృష్టించి గురు వర్గమునకు రక్షణగా ఇచ్చెనట.

కొన్ని జాతకాలలో కుజ దోషము అంటుంటారు. కుజ దోషము అంటే చిన్న విషయము కాదు. శని గ్రహ తత్సమానముగా కుజ గ్రహము తన శక్తిని చాటెను. ఏదైనా ఒక జాతకమునకు శని గ్రహము పాపి అయి అతని దశలో జాతకుడిని ఘోరమైన ఇబ్బందుల పాలుకు గురి చేస్తాడు. అలాగే ఒక జాతకుడికి కుజ గ్రహం పాపి అయినచో ఆ జాతకుడు కుజ గ్రహం యొక్క శక్తిని రుచి చూడవలసిందే. శని గ్రహ శక్తికి దాదాపుగా సమానంగా కుజ గ్రహము శక్తి కలిగి ఉన్నది. సర్వ సైన్యాధక్షుడుగా కుజ గ్రహమును చెబుతారు.

వాస్తు శాస్త్రంలో శని గ్రహము పడమర దిక్కుకు ప్రాతినిత్యం వహిస్తుంది. తత్సమానంగా కుజ గ్రహం దక్షిణానికి ప్రాతినిత్యం వహించడం మనం గమనించవచ్చును.

సాధారణంగా దక్షిణ భాగ దోషము ఉన్న వారికి వారి జాతకంలో కుజ దోషము ఉంటుందని సూచనగా తెలుసుకున్నాము. దక్షిణము చెడడం వల్ల గృహస్థులు ఘోరమైన కష్టాలను ఎదుర్కోవాలి.

గృహము బయట దక్షిణ భాగము పల్లముండి, సరస్సు ఉండటం, బావి ఉండడం, గుంతలు ఉండడం, తదితరములు ఉంటే కుటుంబములో ఎప్పుడూ అశాంతి, అనారోగ్యము, పీడ, ఒక్కోసారి మరణాలు, ధన నష్టము, ఆరోగ్యము కొరకు విపరీతంగా ధనాన్ని ఖర్చు చేయడం, పైగా బయట నుండి వడ్డీకు డబ్బు తీసుకొచ్చి ఆరోగ్యాలకై పోరాడటం, కొన్ని పరిస్థితులలో స్త్రీలు ఇతరులపై మోజు పెంచుకోవడం, మగవారి కోపాలు, ఆడవారు అవమానింప బడటం, మగవారికి చెడు అలవాట్లు అధికం కావడం, కొన్ని సార్లు విపరీతముగా తాగడం, పెట్టెల కొద్దీ పొగ ఊదడం, వీరి ఎదురింటి వారిపై ఎప్పుడూ అసూయా ద్వేషాలు కలిగి ఉండడం, వారు సంతోషంగా ఉండడాన్ని సహించలేకపోవడం, ఆయాచితంగా వారికి ధనం కూడడాన్ని చూసి ఓర్వలేకుండా పోవడం, మానసిక క్షోభ, టెన్షన్లు అధికంగా ఉండడం, హాస్పిటల్ అడ్రస్సులు బాగా తెలిసి ఉండడం, మందుల షాపుల వారి స్నేహితం బాగా

కలిగి ఉండడం, తరువాత ఇరువురు వాదులాడుకోవడం, బలవంతంగా ఇద్దరూ జుట్టు లాగుకోవడం, అయితే వీరికి జుట్టు ఎక్కువ లేకపోవడం కలిసి వస్తుంది, తదితరములు.

గృహము బయట దక్షిణ భాగములో ఎత్తైన అంతస్థులు, మాడీలు, అపార్ట్ మెంట్‌లు, సెల్‌ఫోన్ టవర్లు, కొండలు, గుట్టలు, మిట్ట, మిద్రుగా ఉండటము, తది తరములు ఉంటే రోజుకో బట్ట, పూటకో రుచి లాగా కుటుంబము గడవటం, అధిక ధనాదాయం పట్టిందల్లా బంగారం కావడం, ఏపని చేసినా కలిసి రావడం, అప్పులు తీసుకొనే వారు ఎక్కువకావడం, సకాలంలోవారు తిరిగి సొమ్మును చెల్లించడం, ఇంట ఆడవారి పెత్తనం లేదా మగవారు బయట చేసిన పనులన్నిటినీ ఆడ వారికి చెవిలోపలి కర్ణభేరి పగుళ్ళిచ్చేలా చెప్పడం, ఇంటి ఆడవారి వెంట తిరుగుతూ తాము చేసిన చిన్న పనులను ఘనకార్యాలుగా చెప్పుకుంటూ వారి మెప్పుకై పాకులాడటం, వారి కటాక్షవీక్షణములకై తాపత్రయ పడడం, పెదాలు చెవుల దాకా వచ్చేలా నవ్వడం, వారిని నవ్వించాలని ప్రయత్నం చేయడం, స్త్రీలు చెప్పిన పనులన్నియూ సకాలంలో పూర్తి చేయడం, రెండవ వ్యాపారము ఏర్పడడం, అందు విపరీతంగా ధనం వృద్ధి కావడం జరుగుతుంది.

ఓ చిన్న ఉదాహరణ: కొచ్చిలో ఒక ఆసామి తనకున్న మూడు స్థలాలను పరిశీలించడానికి నన్ను పిలుచుకు వెళ్ళడం జరిగింది. ఈ మూడు స్థలాలలో ఒక స్థలానికి దక్షిణ భాగములో అపార్ట్‌మెంట్ నిర్మాణం జరుగుతున్నది. ఈ స్థలములో గృహ నిర్మాణం కావించమని చెప్పడము, దానికి సరియైన ప్లాను ఇవ్వడము, ఉత్తరము ఖాళీ ఏర్పాటు చేయడము, గృహ నిర్మాణము వాస్తురీత్యా అత్యంత త్వరగా జరిగినది. ఒక్క సంవత్సరము గడిచే లోపలే అతనికున్న రెండు స్థలాలలో ఒక స్థలానికి ప్రక్కనే ఇతరులు ఓ ఫ్యాక్టరీని స్థాపించి ఈయన స్థలము ఈశాన్య భాగము అయినందువల్ల అధిక ధరకు కొనడం జరిగినది. నమ్మండి నమ్మకపొండి ఈయన కట్టిన గృహమునకు అయిన ఖర్చు అంతయూ వచ్చినది. కనీసం ఈయన కలలో కూడా ఈ విషయాన్ని ఊహించలేకపోయారు. దక్షిణము మిద్రు అయితే ఫలితాలు ఇంత అద్భుతంగా ఉంటాయి.

**ఒకవేళ మీకు అప్పులు ఉంటే వాటిని తీర్చడం వాస్తు శాస్త్ర రీత్యా తేలికనే. అయితే విజ్ఞాని, అనుభవజ్ఞుడైన వాస్తు శాస్త్రవేత్తచే మీ గృహాన్ని పరిశీలింప చేయించుకోండి. ఆశ్చర్యకరమైన రీతిలో మీ అప్పులు అత్యంత త్వరగా తీరిపోతాయి.**

**మీకు విపరీతంగా ధనం సంపాదించాలనే కోరిక ఉంటే వాస్తు శాస్త్రము మీకు బాగా సహాయము చేస్తుంది. అయితే మీ గృహము స్వంత గృహమై ఉండాలి. ఏది ఏమైననూ ఒక అనుభవం కలిగిన వాస్తు శాస్త్రవేత్తచే గృహ పరిశీలన చేయించుకున్న వారికి ఫలితాలు ఎప్పటికీ లాభదాయకంగా వుంటాయి.**

ఇక్కడ ఒక చిన్న ఉదాహరణను తెలుసుకుందాము.

పేరు మాణిక్యాలరావు. కర్నాటకలోని ఓ పట్టణం, మైసూరు అనుకోండి. ఈయన బాగా ఉన్నవాడే. అయితే మహా పీనాసి. ఒక ఫ్యాక్టరీ కట్టబోతున్నాడు. దాని పెట్టుబడి 2 కోట్ల రూపాయలు. వాస్తు ప్రాముఖ్యత తెలియడం వల్ల వాస్తు చూపించుకోవాలని నిర్ణయానికి వచ్చి ఒక ప్రముఖ వాస్తు శాస్త్రవేత్తను సంప్రదించాడు. ఆయన రుసుము రూ. 25,000/-. అంత ఎందుకు ఇవ్వాలి అని అనుకొని తనే స్వంతంగా వాస్తు చూసుకొని ఫ్యాక్టరీ నిర్మాణం ముగించాడు. ఆపై కష్టాలంటే ఏమిటో చక్కగా చూశాడు. రూపాయి ఖర్చు పెట్టని మాణిక్యాలరావుకు నెలకు లక్షల్లో నష్టాన్ని చూడవలసి వస్తోంది. ముడి ఇనుమును తీసుకువచ్చి కడ్డీలుగా తయారు చేయడం ఈ

ఫ్యాక్టరీ లక్ష్యం. ఫ్యాక్టరీ పని చేసినా చేయకపోయినా రోజుకు 15,000/- ఖర్చు.

ఫ్యాక్టరీ బాగా నడిస్తే మంచి లాభాలు. నడవకపోతే చక్కటి చిప్ప. వాస్తులో అత్యంత ప్రాముఖ్యత గల కొన్ని విషయాలలో ఏ మాత్రం జాగ్రత్తలు తీసుకోలేదు. అదే ఈయన కొంప ముంచింది. ఈయన ఫ్యాక్టరీకి దక్షిణ భాగములో పెద్ద గుంత గలదు. దాదాపుగా వందలారీల మట్టిని వేస్తే కానీ ఆ గుంత పూడదు. ఈ దక్షిణ గుంతను గమనించలేదు. దక్షిణ శక్తి ఏపాటిదో బాగా చూశాడు. రూ. 25 వేలకు చూసుకొని కోటి రూపాయలకు పైగా నష్టపోయాడు. సైటును అలాగే ఉంచుకొని ఫ్యాక్టరీ మొత్తం పార్ట్స్ పార్ట్స్‌గా అమ్మి చక్కగా అవమానం పొందాడు. భారీ నష్టాన్ని చూశాడు.

ముందుగానే మాట్లాడిన వాస్తు సిద్ధాంతిని పిలుచుకు వచ్చి పరిశీలన కావించి ఉండింటే నష్టం రాక లాభాలను రుచి చూసే వాడు కదా! రూ. 25 వేలకు కక్కుర్తి పడ్డాడు. చావు దెబ్బ తిన్నాడు. ఇలాంటి వాళ్ల జీవితం ఎప్పటికీ ఇలాగే వుంటుంది. పైసా పైసా, కూడబెట్టి కోట్లలో నష్టపోతారు. లేదా ఇతరులు దోచుకు తింటారు. ఇతని కష్టార్జితం ఇతరుల సొత్తు. ఆ అదృష్టవంతుడు ఎవరో భగవంతుడికి తెలియాలి. ఇలాంటి వారికి ఎప్పటికీ బుద్ధి రాదు. తర్వాత జరిగిన సమాచారం.

500లో వెయ్యి రూపాయలో అయితే వాస్తుకు ఇవ్వవచ్చు. 25 వేల రూపాయలు ఇవ్వడము ఏమిటి. కోటి రూపాయలు నష్టం వస్తే వచ్చే అంతేకానీ వాస్తుకు 25 వేల రూపాయలు ఇవ్వడమా!

కోటి రూపాయల కన్నా 25 వేల రూపాయల విలువ ఎక్కువ అన్నది అప్పుడు నాకు తెలిసింది. అంత వరకు 25 వేల రూపాయల కన్నా కోటి రూపాయలే ఎక్కువ అనుకునే వాడిని. పొరపాటు నాదే.

సంపాదించుకునే వారూ బహుపరాక్. దక్షిణం విషయంలో జాగ్రత్తలు తప్పనిసరి. వాస్తు శాస్త్రంలో స్వంత తెలివితేటలు దయచేసి వాడవద్దు. మీ మంచి కోరుతూ తెలపడమైనది. ఆపై మీ ఇష్టం.

## నైఋతి

ఈ నైరుతి అనగానే ముఖ్యంగా నాకు ఓ న్యాయవాది గుర్తుకు వస్తాడు. రాయలసీమ యందలి ఓ పట్టణంలో ఒక న్యాయవాది నైరుతి బ్లాకుగా గృహాన్ని నిర్మించాడు. ఈయన గృహమును నిర్మించు సమయములోనే వెనుకాముందు చూసుకోక ఒక అనుభవజ్ఞుడైన వాస్తు శాస్త్రవేత్తను పిలిపించి స్థలాన్ని పరిశీలింప చేయించి వాస్తు శాస్త్ర రీత్యా మంచి నిర్మాణాన్ని సాగించి అద్భుతమైన ఫలితాలను పొందసాగాడు. ఈయన గృహాన్ని నిర్మించు సమయంలో అంత డబ్బు పోసి వాస్తు శాస్త్రవేత్తను ఎందుకు పిలిచావని చాలా మంది అడిగారట. ఈయన ఇచ్చింది పైసా, పొందింది వెయ్యి. అలాగ ఈయనకు దినాలు జరుగ సాగాయి. మంచి పేరు, చేతి నిండా డబ్బు ఉండేది.

ఈయనకు ఒక ఫ్యాక్షన్ నేత అత్యంత సన్నిహిత మిత్రుడు. ఆ నేతకు ఏ కష్టము వచ్చినా న్యాయవాది గృహానికి వచ్చి కొద్ది రోజులు వుండి వెళ్లేవాడు. అదేమి ఆశ్చర్యమో తెలియదు కానీ ఆ నేతకు సమస్యలు తీరేవి. ఈ పరిస్థితిని గమనించిన ఆ ఫ్యాక్షన్ నేత తన గృహమును కూడా వాస్తు చూపించుకోవాలని తలచి ఆ న్యాయవాది ద్వారా ఆ వాస్తు శాస్త్రవేత్తను సంప్రదించడం జరిగినది. ఫ్యాక్షన్ నేతలు అంటే ఇష్టం లేని ఆ వాస్తు శాస్త్రవేత్త, ఫ్యాక్షన్ నేత ఎంత అడిగిననూ ఆయన గృహాన్ని పరిశీలించడానికి ఒప్పుకోలేదు. కాలక్రమంలో ఫ్యాక్షన్ నేత పనుల ఒత్తిడితో న్యాయవాది గృహానికి రావటం పూర్తిగా తగ్గించాడు. కొద్ది రోజుల తర్వాత అనారోగ్యం పాలై ఓ

నగరంలో చికిత్స పొంది తిరుగు ప్రయాణంలో తన ఊరికి చేరుకుంటుండగా మార్గమధ్యంలో ఆయనను ప్రత్యర్థులు హత్య చేశారు.

నైరుతి అనగానే ఇంకొక్కటి గుర్తుకు వస్తుంది. అదే భద్రత. నైరుతి ఏ దోషమూ లేకుండా వుంటే జీవితం అంత భద్రత కలిగి ఉంటుంది. ఫ్యాక్షన్ నేతలు నైరుతి విషయంలో అత్యంత సూక్ష్మమైన పొరపాటు కావించిననూ పరిణామమును రుచి చూడవలసి వుంటుంది. రాజకీయ నాయకులు కూడా నైరుతి విషయంలో అనేక జాగ్రత్తలు తీసుకోవాలి. ప్రత్యర్థులతో ప్రమాదం గలదని విషయం బయటకు పొక్కినచో నైరుతిలో ఏ దోషములు లేకుండా జాగ్రత్త వహించినచో మంచి జరుగు అవకాశం చాలా ఎక్కువ. అక్రమంగా ఇతరులను దోచుకు తిన్న వారు, ఇతరుల ఉసురు పోసుకున్న వారు భవిష్యత్తులో ఛేదు అనుభవాలను రుచి చూడక తప్పదు. కష్టపడి నిజాయితీగా సంపాదన కావించండి. ఏనాటికీ దిగజారిపోవడము చేయవద్దు. ఇతరుల సొమ్ముపై కన్ను వేయడమంటే మీరు తినే ఆహారంలో గడ్డి కలుపుకున్నట్లే.

గృహము బయట నైఋతి భాగము పల్లముగా ఉండి, బావులు, గోతులు, కొలనులు, గుంతలు, ఉన్నచో వాస్తురీత్యా నైఋతికి ఒక గుర్తింపు కలదు. ఈ నైఋతి భాగము మిట్టుగా ఉండి ఎత్తె, బలముగా, నిండుగా ఉండవలెను. అట్లుగాక దానికి వ్యతిరేకంగా ఉంటే ఫలితములు కూడా అంతే ఘోరంగా ఉంటాయి. మరణాలు, ఆకస్మిక ఆక్సిడెంట్లు, ప్రమాదాలు, విపరీతమైన ధననష్టము, మనశ్శాంతి కోల్పోవడం, అభద్రతా భావము, పిల్లల ఎదుగుదలపై విపరీతంగా ఆలోచన పెట్టుకొని క్రుంగిపోవడం, ఇంటియందు కలహాలు, పక్షవాతం, మందులకు నయం కాని రోగాలు, మందుల కొరకు విపరీతంగా డబ్బులు ఖర్చు పెట్టడం, వ్యాపారంలో విపరీతంగా నష్టపోవడం, సమాజంలో అగౌరవం, ఎప్పుడూ ఇతరుల నోళ్ళలో గృహస్థుల విషయాలు నానుతుండడం, తదితరములు. గృహము బయట నైఋతి భాగము యందు కొండలు గానీ, గుట్టలు గానీ, ఎత్తైన అపార్ట్‌మెంట్‌లు గానీ, టవర్లు ఉండడం గానీ, బలమైన వృక్షాలు ఉండడం గానీ, మిట్టుగా ఉండడం గానీ ఇతరత్రా ఉన్నచో పూర్తీ భద్రతా భావము, ధనాదాయం, ఆరోగ్యము బాగుండడం, బలంగా మాట రావడం, మనసు యందు హుషారుగా ఉండడం, వ్యాపారములో చక్కగా అభివృద్ధి కలిగి యుండడం, మాట, పలుకుబడి ఉండడం, ఇతరులు సలహాల కోసం రావడం, ధనము, ధాన్యము ఎప్పటికీ నిలువ కలిగి ఉండడం, వ్యవహారము లలో విజయము, శత్రు నాశనం, శత్రువుల ప్రయోగాలు విఫలము కావడం ఇతరత్రా.

## పశ్చిమము

పశ్చిమానికి శని గ్రహము ప్రాధాన్యత వహిస్తుందనే విషయం ఇంతకు ముందే తెలుసుకున్నాము. శని శక్తితో కుజుడిని పోల్చామేకానీ, కుజునితో శనిని పోల్చలేదు. గమనించాలి. శని గ్రహం యొక్క శక్తిని చెప్పడము కష్టము అనుకోవాలి. శని మహాశక్తిమంతుడు. శని విషయంలో ఎన్ని జాగ్రత్తలు తీసుకుంటామో అన్నే జాగ్రత్తలు పశ్చిమ విషయంలో కూడా తీసుకోవాలి. గృహము అన్న తర్వాత అన్ని అనుకూలతలు వుండాలి. అలాగే వాస్తు శాస్త్ర రీత్యా గృహ నిర్మాణమంటే అన్ని దిక్కులూ, అన్ని మూలల విషయంలోనూ జాగ్రత్తలు తీసుకోక తప్పదు. ఎంతసేపూ ఈశాన్యము, ఉత్తర, తూర్పుల గురించి మాట్లాడుకున్ననూ పశ్చిమమును అశ్రద్ధ చేయరాదు.

గృహము బయట పశ్చిమ భాగము పల్లముగా ఉండి, బావులు, గోతులు, గుంతలు, కొలనులు, కాలువలు ఉన్నచో అభద్రతా భావము, అశాంతి, పక్షవాతము, అనారోగ్యము, ధననష్టము, వ్యాపార నష్టము, పరువు ప్రతిష్టలు

నాశనము కావడము, శత్రువుల విజయం, వ్యవహార అపజయం, ఆడవారి సూటిపోటు మాటలు, నిందలు, పురుషులు చాటు మాటుగా మద్యం సేవించి తాత్కాలికంగా స్వాంతన పొందడం, బాగా గుర్తింపు ఉన్నచోట అకస్మాత్తుగా అవమానం పాలుగావడం, అవిద్య, పిల్లలు జులాయిగా తిరగడం, ఇతరత్రా. గృహము బయట పశ్చిమ భాగము ఎత్తుగా ఉండి, ఎత్తైన అంతస్థులు, మాడీలు, అపార్ట్‌మెంట్‌లు, సెల్‌ఫోన్ టవర్లు, కొండలు, గుట్టలు, మిట్ట, మిర్రుగా ఉండటము, తదితరములు ఉన్నచో ఉన్నత విద్య, కొన్ని పరిస్థితులలో విదేశీ యోగం, సంస్కారం, గుర్తింపు, పలుకుబడి, విజయం, శత్రు నాశనం, పని కట్టుకొని నాశనం చేయాలని చూసే వారు అవమానింపబడడం, అది గృహస్థులకు కలిసి రావడం, ఆరోగ్యం బాగుండటం, కుటుంబము యందు మనశ్శాంతి, పట్టుకున్న పనులయందు విజయము, పెద్దలకు గౌరవము, న్యాయబుద్ధి, భద్రతా భావము, బంధువులు, స్నేహితుల మధ్యలో ఉన్నతాసనము, రాజకీయ రంగములో ఉన్నవారికి ప్రత్యేక గుర్తింపు, ఉన్నత పదవుల ప్రాప్తి, ధనవృద్ధి, వ్యాపారములో బాగా కలిసి రావడం, వ్యవహారములలో వైనంగా ప్రవర్తించి అందరినీ ఆకర్షించడం, పిల్లలకు మంచి విద్య లభించడం, పాఠశాల యందు గుర్తింపు ఇతరత్రా.

## వాయవ్యము

వాయవ్యం, అనుకోగానే ఓ పెట్రోల్ బంకు యజమాని మనస్సులో మెదులును. ఈయన గృహంలో వాయవ్యములో నీళ్ల గుంత వుండెడిది. ఎంతో షావుకారి అయిన ఈ పెట్రోల్ బంక్ యజమాని ధనమంతయూ పోగొట్టుకొని అప్పులపాలై పెట్రోల్ బంక్‌ను వేలానికి తెచ్చెను. చిట్ట చివరి క్షణంలో వాయవ్య గుంతను పూడ్చివేసెను. గంటకంతయూ ఫలితాల కోసం ఎదురు చూసెను. వాస్తు శాస్త్రమునకు గంటకు, దినమునకు ఫలితములను ఇచ్చు శక్తి లేదు. ఈ విషయం తెలియక వాస్తు శాస్త్రమును నిందించసాగెను. వీరు నమ్మిన సిద్ధాంతాలు వీరినే నాశనం చేసెను. వాయవ్య గుంత మంచిది కాదని పక్కింటి వారి గృహాన్ని పరిశీలించడానికి వచ్చిన వాస్తు శాస్త్రవేత్త తెలిపిననూ ఆయన మాటకు గౌరవం ఇవ్వక ఉన్నదంతయూ పోగొట్టుకొని నాశనమాయెను.

వ్యాపారం చేయువారు వాయవ్య విషయంలో జాగ్రత్తలు తీసుకోవలెను. చిన్న పొరపాటు జరిగిననూ దుకాణం మూసుకోవలసి వుంటుంది. ఫ్యాక్టరీకి తాళం వేసుకోవలసి వుంటుంది. వాయవ్యము ధన, మానసిక భద్రతకు ప్రాధాన్యతను ఇస్తుంది. వాయవ్యము చెడితే మనిషి చెడినట్లే. వాయవ్యములో గుంతలు ఉన్నా, మిట్టలు వున్నా కష్టమే. వాయవ్యములో జాగ్రత్తలు మాత్రం ఉండాలి.

గృహము వెలుపల వాయువ్య భాగమున పల్లముగా ఉండి, బావులు, గోతులు, గుంతలు, కొలనులు, కాలువలు ఉన్నచో వ్యాపార నష్టము, ఘోరమైన మానసిక అశాంతి, క్షోభ, వ్యధ, బాధ, బుద్ధి అతలాకుతలమై అశాంతికి గురి కావడం, ఆడవారి చేతిలో అవమానింప బడడం, పూచీలు పడి సొమ్ముంతయూ నాశనం చేసుకోవడం, ముఖ్యంగా అప్పులు, వీటిని తీర్చడానికై కిందా మీదా పడడం, నరాలు తెగేలా ఆలోచన చేయడం, ఉన్న నరాలన్నీ ఉబ్బి ఉండడం, ఒక్కోసారి కయ్యిమని ఇంటిలోనివారిపై విరుచుకు పడడం, ఉదయమంతా భయం భయంగా ఉండడం, ఎక్కువ వెలుతురును సహించ లేకపోవడం, రాత్రి కావడమాలస్యం హుషారుగా ఉండడం, భార్యను దగ్గరకు తీసుకోవడం, పూలు ఇతరత్రా తెచ్చి ఇవ్వడం, ఉదయానికి అదే భార్యపై పీకల దాకా కోపం కలిగి ఉండడం, మాట్లాడితే బుస్సు, కస్సు మనడం, దేవాలయాల చుట్టూ తిరగడం కొద్ది రోజులు దేవుడున్నాడని, కొద్ది రోజులు దేవుడు లేనే లేడని, ఆకాశముపై ఉమ్మి ముఖంపై చల్లించుకోవడం, తరువాత తెప్పరిల్లి ముఖం కడుగు

కోవడం, ఇటువంటి మూర్ఖపు పనులు చేయడం, స్వాముల చుట్టూ తాయెత్తుల కోసం తిరగడం, తాయెత్తుల బరువులు మోయలేక కుంటుతూ నడవడం, గూని రావడం, దొంగ స్వాములకు బలైపోవడం, ఇంటి తాళాలను సైతం దొంగ స్వాములకు అప్పజెప్పడం, చిన్న పిల్లవాడి మనస్తత్వం వలె వారిచేతిలో మోసపోవడం, గుట్టును నడపడం, గుట్టుగా సాగడం, చిన్నపాటి సందుల్లో ఎక్కువగా తిరగడం, కామ కోరికలున్ననూ సఫలం కాలేకపోవడం, నరాల బలహీనత, వ్యభిచరించడం, ఒక్కో సారి నోటినుండి మాట సరిగా పెగలకపోవడం, పిచ్చి పట్టడం తదితరములు. గృహము బయట వాయువ్య భాగము ఎత్తుగా ఉండి, ఎత్తైన అంతస్థులు, మాడీలు, అపార్ట్‌మెంట్‌లు, సెల్‌ఫోన్ టవర్లు, కొండలు, గుట్టలు, మిట్ట, మిర్రుగా ఉండటము, తదితరములు ఉన్నచో దరిద్రము, వినాశనము, ఇతరత్రా. అందువల్ల వాయువ్య భాగము ఎత్తు, తగ్గులు లేకుండగా నైఋతి కన్నా తక్కువగా ఈశాన్యము కన్నా ఎత్తుగా ఉండేలా చూసుకోవాలి.

## ఉత్తరము

ఉత్తరం కుభేరం, లక్ష్మీ సమాన స్థానం. ధనాధిపత్యం.

గృహము వెలుపల ఉత్తర భాగమున పల్లముగా ఉండి, బావులు, గోతులు, గుంతలు, కొలనులు, కాలువలు ఉన్నచో ముట్టిందల్లా బంగారం, రూపాయి కోసం వెళితే పది రూపాయలు లభ్యం కావడం, రెండు మూడు వ్యాపారాలు ఉండడం, వాటియందు అభివృద్ధి, ఆరోగ్యం బాగుండడం, చీకూ చింతా లేని జీవనం, భోగ భాగ్యాలు, ధన ధాన్యలు, సకల సుఖాలు, సర్వ శుభాలు, నిత్యానందం, సర్వదా సంతోషం, ధనం బాగా కూడి ఉండడం, బ్యాంకుల యందు చక్కగా ధన నిల్వలు కలిగి ఉండడం, పిల్లలకు విద్యా ప్రాప్తి, ఆడపిల్లలకు మంచి సంబంధాలు లభించడం ఇతరత్రా. గృహము బయట ఉత్తర భాగము ఎత్తుగా ఉండి, ఎత్తైన అంతస్థులు, మాడీలు, అపార్ట్‌మెంట్‌లు, సెల్‌ఫోన్ టవర్లు, కొండలు, గుట్టలు, మిట్ట, మిర్రుగా ఉండటము, తదితరములు ఉన్నచో నిత్య దరిద్రం, మందు మాకులకు ధనము నాశనం చేసుకోవడం, అనారో గ్యాలు, మెదడు నిండా ఆలోచనలు, నిష్ఠూరాలు, నిందలు, ధన నష్టాలు, వ్యాపార నష్టాలు, బుద్ధి మాంద్యం, అనుకూలించని కుటుంబ సభ్యులు, ఆడవారి పెత్తనం, కీచులాటలు, కొట్లాటలు, కుమ్ముకోవడాలు, గలాటలు, నిత్యమూ వర్ధిల్లుతుంటాయి, బాకీలు వసూలు కాకపోవడం, ఇతరత్రా.ఇంటి బయట హెచ్చుతగ్గులు ఉండడమనేది మనకంటి చూపుతో హెచ్చు తగ్గులు కనబడక కొలతతో హెచ్చు తగ్గులు కనిపించినచో అది దోషం కాని, శుభం కాని ఎక్కువ ప్రభావం గృహంపై చూపించదు. అనగా ఒక తూర్పు గృహమును తీసుకోండి. ఈ గృహం బయట ఈశాన్యం భాగం యందు ఎత్తు కలిగివుండి ఆగ్నేయం నకు వెళ్ళుకొలదీ పల్లమైనచో వాస్తురీత్యా శుభకరము కాదు కదా. అలాగని ఇది కంటి చూపుకు కనిపించే హెచ్చు తగ్గ అయివుండాలి. అలాకాక ఎత్తు పల్లము అనేది కంటిచూపుకు కాక కొలతలు తీస్తే తప్ప ఎత్తు పల్లాలు బయట పడకపోతే ఆ దోషాలు మిమ్ములను అంతగా ఏమీ చేయవనేది గమనించాలి. ఒకవేళ గృహం బయట ఈశాన్యం మరియు ఆగ్నేయ భాగం యందు కొలత తీసుకొని ఈశాన్యం ఎత్తుగా ఉందని ఆగ్నేయం పల్లమైందని యోచన చేయడం వద్దు. కొలతతో మాత్రమే తెలిసే గృహం బయట ఎత్తుపల్లాలు గృహస్థులను పెద్దగా ఇబ్బందులకు గురిచేయవు.

## వీధులు

వాస్తు శాస్త్రంలో వీధులకు ఒక గుర్తింపు కలదు. మన గృహము బయట వీధి భూమి మట్టము ఎత్తుగానూ, లేదా పల్లముగానూ ఉన్నచో దాని ప్రభావము మన గృహముపై ప్రసరింప చేయును.

పరిసరవాస్తులో ఇది ఒక భాగమే. మన గృహము బయట వాడుకలో ఉన్న నడకను, రోడ్డును, వీధి అంటాము. ఈ వీధులు కూడా మన గృహముపై ప్రభావమును చూపిస్తాయి. ఉదాహరణకు మనది తూర్పు వీధి గృహము అనుకుందాము. అనగా మన గృహమునకు తూర్పు భాగమున రోడ్డు దక్షిణము నుండి ఉత్త రానికి సాగుతుంటుంది. ఈ రోడ్డే దక్షిణ భాగములో పల్లముగా ఉండి ఉత్తరమునకు సాగే కొద్దీ మిట్ట లేదా ఎత్తు అయినచో ఆ రోడ్డు ఫలితములు మనకు అందక పైగా అశుభ ఫలితములను మన గృహమునకు ఇస్తాయి.

ఒకవేళ వీధి దక్షిణమునందు మిట్ట, ఎత్తుగా ఉండి ఉత్తరమునకు పోవు కొద్దీ పల్లమైనచో ఆ శుభఫలితములు మన గృహమునకు అందుతాయి. తద్వారా ధనవృద్ధి ఇతరత్రా అనుకూలమైన పరిణామములు ఉండును. వీధులు వేరు మరియు వీధి పోట్లు వేరు. శుభకరమైన వీధి చూపులతో అద్భుతమైన జీవనం లభిస్తుంది. అశుభ కరమైన వీధిపోట్లతో జీవితం భ్రష్టుపడుతుంది. శుభము కానీ  అశుభము కానీయండి వీధిపోట్ల ప్రభావము గృహముపై చాలా ఎక్కువగా ఉంటుంది. అదే వీధులైతే శుభాశుభముల ప్రభావము అంత ఎక్కువగా ఉండదు.  కానీ చిన్న పాటి ప్రభావము గృహముపై చూపిస్తుంది.

మీ గృహము  వాస్తురీత్యా ఉన్నచో బయటవీధి  శుభము కానీ, అశుభము కానీ ప్రభావము కొద్దిగా ఉంటుంది. అదే మీ గృహము వాస్తురీత్యా నిర్మించు కోకపోయి నట్లయితే బయట వీధి ప్రభావం కాస్త ఎక్కువగా  ఉంటుంది.

## తూర్పు వీధి

మన గృహమునకు బయట తూర్పు భాగమున వీధి ఉన్నచో ఆ వీధిని తూర్పు వీధి అంటారు. ఈ తూర్పు వీధి ఉత్తరము నుండి దక్షిణముగా లేదా దక్షిణము నుండి ఉత్తరముగా సాగుతుంది. మీరు ఎలా అనుకున్నా ఒక్కటే. అయితే వాస్తు శాస్త్రజ్ఞులు మాత్రము దక్షిణము నుండి ఉత్తరము పోతుందని అంటారు. దక్షిణము నుండి ఉత్తరము వైపుగా నడక శుభము కావున ఈ విధంగా అనడం పరిపాటి. అంతేగాని ప్రత్యేకించి దీనికి ఓ విధానము అంటూ లేదు. తరువాత అంతయూ ఈ విధంగానే వాడుక విధానమును పాటిద్దాము.  ఉదాహరణకు ప్రక్క పేజీలోని పటమును గమనించండి.




ఈ నమూన పటములో నడకను దక్షిణము నుండి ఉత్తరమునకు సాగుతున్నట్లుగా చూపడమైనది. ఒకవేళ వాస్తుపట్టు గల గృహము బయట వీధికి ఉత్తర భాగమున బాగా ఎత్తుగా, మిర్రుగా ఉండి దక్షిణమునకు బాగా పల్లముగా ఉన్నచో దక్షిణము పల్లము కాకూడదు కాబట్టి అశుభ ఫలితము గృహముపై కాస్త ప్రభావము చూపించును. తద్వారా సమయానికి రావలసిన సొమ్ము చేతికి అందకపోవడము, అలర్జీలు, చర్మ వ్యాధులు లాంటి చిన్నపాటి రోగాలతో బాధపడడం, స్పెక్యులేషన్ బిజినెస్ ద్వారా కాస్తైనా నష్టం జరగడం, మీరు చిన్న మొత్తాలు అప్పు ఇచ్చిన వారు ఐ.పి. పెట్టడం, చిన్నమొత్తాలకు ష్యూరిటీలు ఇవ్వడం, ష్యూరిటీ తీసుకున్నవారు జారుకోవడం తప్పదు కాబట్టి మీరు డబ్బు కట్టడం లాంటివి జరగడం, కాస్త మనశ్శాంతి కోల్పోవడం తదితరములు సంభవించును. ఏది జరిగిననూ చాలా చిన్నగానే జరుగును.

ఒకవేళ మీ తూర్పువీధి, గృహమునకు తూర్పు వీధి దక్షిణ భాగము ఎత్తుగా ఉండి ఉత్తరమునకు సాగుకొద్దీ పల్లమైనచో మంచి శుభ పరిణామములు మీకు లభించును. ఆరోగ్యము బాగుండడం. ఇచ్చిన సొమ్ము అంతయూ త్వరగా వసూలు కావడం, చిన్న పాటిగా సైడ్ బిజినెస్ ఏర్పడడం, రాదు అనుకున్న సొమ్ము చేతికి దక్కడం అలర్జీలు, చర్మ వ్యాధులు, ఇతరత్రా చిన్నపాటి రోగాలు మాయమవడం, మనము చెప్పుతున్న మాట ఇతరులు శ్రద్ధగా వినడము, సమయానికి పనివారు రావడం ఆనందకరమైన జీవనం తదితరములు.

## దక్షిణ వీధి

మన గృహమునకు దక్షిణ వైపున వీధి ఉన్నచో ఆ గృహమును దక్షిణ వీధి గృహము అంటారు. మరియు ఆ వీధిని దక్షిణ వీధి అంటారు. సాధారణ భాషలో దక్షిణ వీధిని పశ్చిమమునుండి తూర్పుకు సాగుతుంది అని అంటారు. కొందరు నైఋతి నుండి ఆగ్నేయమునకు సాగుతుంది అంటారు. సరైన పద్ధతి మాత్రము పశ్చిమము నుండి తూర్పుకు అనాలి. ఎందుకంటే మన ఎదురింటి వాళ్ళకు ఇదే వీధి ఉత్తర వీధి అవుతుంది కదా. అప్పుడు వారికి నైఋతి నుండి ఆగ్నేయమునకు సాగుతుంది అనడానికి వీలులేదు. వాయువ్యము నుండి ఈశాన్యమునకు సాగుతుంది అని అనుకోవాల్సి వస్తుంది.

మన గృహమునకు ఎదురుగా గల దక్షిణవీధి నైఋతి ప్రాంతము బాగా ఎత్తుగా, మిర్రుగా ఉండి తూర్పుకు సాగేకొద్దీ అనగా మన గృహమునకు ఆగ్నేయము దిక్కుగా సాగుకొద్దీ పల్లమైనచో భద్రత గల జీవనము, మాట, పలుకుబడి, ధనవృద్ధి, ఆయుష్షు, ఆరోగ్యము, కులాసా జీవనము, మనశ్శాంతి తదితరములు.

ఇదే వీధి నైఋతి భాగములో పల్లమై ఆగ్నేయ భాగములో ఎత్తుగా ఉన్నచో భయం భయంగా ఉండడం, నోటనుండి మాట సరిగా రాకపోవడం, ప్రతి ఒక పనికీ భయపడడం, ఎప్పుడు ఏమౌతుందో అనే టెన్షన్, అనారోగ్యము, అసరా లేకుండా పోవడం, పనుల ఆటంకం, డాక్టర్ల దగ్గరకు పదే పదే వెళ్ళడం

జరుగును. ఒక్కొక్కసారి గృహములో వాస్తు సరిగా లేనప్పుడు మరియు ఇతర వాస్తు దోషాలు కలిసినప్పుడు మరణాలు కూడా సంభవించే ప్రమాదము వుంది. లేదా పక్షవాతము లాంటి బలమైన రోగాల పాలు పడవలసి వుంటుంది.

## పశ్చిమ వీధి

మన గృహమునకు పశ్చిమ వైపున వీధి ఉన్నచో దానిని పశ్చిమ వీధి అంటారు. ఈ వీధి దక్షిణము నుండి ఉత్తరమునకు సాగుతూ ఉంటుంది. ఇదే వీధిలో నైఋతి భాగము ఎత్తుగా ఉండి ఉత్తరమునకు వెళ్ళు కొద్దీ పల్లమైనచో గృహస్థులకు భద్రత కలిగిన జీవనము, ప్రతిష్ఠ, ధన నిల్వ, ఆరోగ్యము, బంధువులలో, స్నేహితులలో, సమాజములో గౌరవము ఉన్నతమైన ఆలోచనలు వాటిని అమలు జరపడానికి ప్రయత్నములు, ప్రయత్న విజయము తదితరములు. నైఋతి నుండి ఉత్తరమునకు పల్లము అనునది గృహము యందలి ప్రహారీగోడ భూమి మట్టము కన్ననూ పల్లము కారాదు. ఈ భూమి మట్టము కన్ననూ ప్రహారీ బయట వాయవ్య భాగమునందు పల్లమైనచో దోషపరిహారంగా మన గృహముయందలి ప్రహారీలో పశ్చిమ భాగమును ఎత్తు చేసుకోవడం చాలా మంచిది. కొందరు ఒక ప్రశ్న వేస్తుంటారు. పశ్చిమ ముఖద్వారము గల గృహము యోగించదు. దీనివల్ల గృహస్థులు అనేక బాధలకు గురౌతుంటారు అని... నా సమాధానంగా వీరికో విషయం చెబుతాను. ఒకవేళ నిజంగా పశ్చిమ గృహము యోగించకపోతే భారతదేశంలో పాతిక శాతం గృహములను కొట్టివేయ వలసి వస్తుంది. వీరి ప్రశ్నకు అర్థం లేదు. జరుగుతున్న యదార్థం ఏమంటే పశ్చిమ ముఖద్వార గృహమునకు పశ్చిమ భాగములో ప్రహారీ వుండి తూర్పున ఖాళీ లేకపోవడం వల్ల ఉత్తమ ఫలితాలు రావు. ఇటువంటివి కారణాలు. అవి గమనింపక కొందరు ఏదేదో తెలుపుతూ గృహస్థులను భయభ్రాంతులకు గురి చేస్తుంటారు. ఇటువంటి వారి విషయంలో ఆదుర్దా పడవలసిన అవసరం లేదు. నైఋతి పల్లమై ఉత్తరమునకు సాగుతూ ఎత్తుగా ఉన్నచో పై చెప్పుకున్న వాటికి వ్యతిరేకముగా జరుగును. పైగా మరణభయం, రోగాలు, దరిద్రము తదితరములు.

## ఉత్తర వీధి

మన గృహమునకు ఉత్తర వైపున వీధి ఉన్నచో దానిని ఉత్తర వీధి అంటాము. ఈ వీధి పడమర నుండి తూర్పుకు సాగుతూ ఉంటుంది. వాయువ్య భాగములో ఎత్తుగా ఉండి ఈశాన్యమునకు వెళ్ళు కొద్దీ పల్లముగా ఉన్నచో ధనవృద్ధి, నిలకడ కలిగిన జీవనము, అన్నింటా అభివృద్ధి, రెండవ వ్యాపార ప్రయత్నములు, ధనము కొరకు ఇతరులు మోసగించాలని ప్రయత్నించినా వారి ప్రయత్నాలు ఫలించక పోవడం, ఆరోగ్యము, మనశ్శాంతి, భోగభాగ్యాలు, సుఖ సంతోషాలు.

వాయువ్యము పల్లమై తూర్పుకు పోవు కొద్దీ ఈశాన్యము మిద్రుగా ఉన్నచో పై చెప్పుకున్న వాటికి వ్యతిరేకము జరుగుతూ దరిద్రము, వ్యాపార నష్టము, ధననష్టము, మానసిక క్షోభ, వ్యధ, బాధ, అశాంతి, అసంతృప్తికర జీవనము వుండును.

# వీధిపోట్లు

నవీన వాస్తు శాస్త్రవేత్తల కృషిలో ఒక భాగము ఈ వీధిపోట్లు. వీధిపోట్లనే వీధి చూపులు, వీధి శూల, వీధి బల్లెం ఇంగ్లీష్‌లో అయితే స్ట్రీట్ ఫోకస్ అని అంటారు.

పూర్వ కాలములో వీటిపై అంతగా అవగాహన ఉండేది కాదు. నవీన వాస్తు శాస్త్రజ్ఞులు ఈ వీధిపోట్ల విషయం బాగా పరిశోధన చేశారు. గృహము వాస్తుశాస్త్రరీత్యా నిర్మించుకున్నచో గృహము బయట ఏదైనా వీధి మన గృహమును తాకుతున్నచో ఆ వీధిని వీధి పోటు లేదా వీధి చూపు అని అంటాము. మంచి వీధిపోట్లను వీధి చూపులని, చెడు వీధి పోట్లను వీధి పోట్లు అని అంటారు. అనగా తూర్పు ఈశాన్యము వీధిపోటును వీధి పోటు అనక తూర్పు ఈశాన్య వీధి చూపు అంటారు. అలాగే తూర్పు ఆగ్నేయ వీధి చూపు అనరు. తూర్పు ఆగ్నేయ వీధిపోటు అని అంటారు.

వీధిపోట్లలో కూడా రెండు రకాలు ఉన్నాయి. 1. బలంగా తగిలే వీధిపోటు, 2. బలహీనంగా తగిలే వీధిపోటు. ఇప్పుడు బలంగా తగిలే వీధిపోటు గురించి తెలుసుకుందాము.

ఈ పటమును గమనించండి.




ఈ పటము యందు కనిపించే గృహము దక్షిణ వీధి గృహము. ఈ దక్షిణ వీధి వెడల్పు తక్కువగా ఉండి చిన్నపాటి వీధి అనిపించు కుంటుంది. అదే ఈ గృహమునకు దక్షిణ ఆగ్నేయ వీధిపోటు తగలడం గమనించండి. అది ఎంత పెద్దగా ఉందో, విశాలము కలిగి బలంగా గృహమును తగలడం గమనించవచ్చు. దీనినే బలంగా తగిలే వీధి పోటు అంటారు. దీని ప్రభావము గృహముపై విపరీతంగా ఉంటుంది. ఇప్పుడు బలహీనమైన వీధిపోటును గమనించండి.




పై పటమునందలి గృహము నమూనా కూడా దక్షిణ వీధి కలిగినది. అయితే ఈ దక్షిణ వీధి ఎంతో విశాలత్వముతో వెడల్పుగా ఉన్నది. దక్షిణ ఆగ్నేయ వీధిపోటు బలహీనంగా ఉండడాన్ని గమనించవచ్చు. బలహీనంగా ఉన్నందువల్ల ఫలితాలు కూడా బలహీనంగా వుండును. కారణమేమంటే మధ్యలో వెడల్పు

కలిగిన దక్షిణ వీధి వుండడం వల్ల దక్షిణ ఆగ్నేయ వీధిపోటు బలహీనమైనది. కావున వీధిపోటు అనంగానే కంగారు పడి భయపడాల్సిన అవసరం లేదు. అది బలహీనమైనదా లేదా బలము కలిగి ఉన్నదా అనేది గమనించాలి. ఇక్కడ మీరో విషయం శ్రద్ధగా గమనించాలి.

గృహము వాస్తురీత్యా నిర్మాణం అయినచో బలహీనమైన వీదిపోటు వల్ల అది శుభం కానీ అశుభం కానీ కలిగించే వీధిపోటు అయినా దాని ప్రభావము గృహముపై బలహీనముగా ఉండును. కావునే వాస్తు శాస్త్రజ్ఞులు గృహమును వాస్తురీత్యా నిర్మించుకోమని పదే పదే తెలుపుతారు. ఈ వీధి పోట్లు కూడా పరిసర వాస్తులో ఒక భాగమే. మన గృహము తక్క మిగిలిన బయట ప్రాంతములో ఏదైననూ పరిసరవాస్తు క్రిందనే లెక్క. అందుకే వీధిపోటు అనగానే ముందుగా మనము పరిగణనలోనికి తీసుకోవాల్సిన విషయాలు చాలా ఉన్నాయి.

1. వీధి పోటు వీధి యొక్క వైశాల్యము 2. జనసాంద్రత ఎక్కువగా కలిగినదా లేదా 3. గృహమునకు వీధిపోటు నేరుగా తగులుతున్నదా లేదా మధ్య ఏదైనా రహదారి ఉన్నదా 4. ఒకవేళ రహదారి ఉన్నచో ఆ రహదారి వైశాల్యము ఎంత దాని జన సాంద్రత ఎంత. 5. వీధిపోటు తగులుతున్న గృహము వాస్తురీత్యా నిర్మించినదా, లేదా, అను విషయాలను పరిగణనలోకి తీసుకోవాలి.

లాభము గానీ, నష్టాలు గానీ మనవరకే అంతము కావు. మన తరువాత తరాల వారికి కూడా తగులుకుంటాయి. లాభమైతే ఫర్వాలేదు, ఏ తొందరా లేదు. సంతోషమే. అదే నష్టమైతే మిడి మిడి జ్ఞానంతో మనం చేసుకున్న పనికి అనవసరంగా ఘోరమైన బాధలు పడవలసి ఉంటుంది. శుభమైన వీధిపోటు గృహమునకు తగులుతున్నచో నాయకులతో పోరాడినా గెలుపు మనదే అవుతుంది. అశుభమైన వీధిపోటు గృహమునకు తగులుచున్నచో బలహీనులతో పోరాటానికి కూడా కనీసం సిద్ధపడలేము. శుభమైన వీధిపోటు బికారిని రాజును చేస్తుంది. అశుభమైన వీధిపోటు రాజును బికారిని చేస్తుంది.

ఇప్పుడు మనము వీధిపోట్లు ఎన్ని అందులో శుభకరమైనవి ఎన్ని, అశుభ కరమైనవి ఎన్ని అనే విషయమును తెలుసుకుందాము.

శుభకరమైన వీధిపోట్లు : 1. ఈశాన్య వీధిపోటు 2. తూర్పు ఈశాన్య వీధిపోటు 3. తూర్పు వీధిపోటు 4. దక్షిణ ఆగ్నేయ వీధిపోటు 5. దక్షిణ వీధిపోటు 6. పశ్చిమ వీధిపోటు 7. పశ్చిమ వాయువ్య వీధిపోటు 8. ఉత్తర వీధిపోటు 9. ఉత్తర ఈశాన్య వీధిపోటు.

అశుభకరమైన వీధిపోట్లు : 1. తూర్పు ఆగ్నేయ వీధిపోటు 2. ఆగ్నేయ వీధిపోటు 3. దక్షిణ నైఋతి వీధిపోటు 4. నైఋతి వీధిపోటు 5. పశ్చిమ నైఋతి వీధిపోటు 6. వాయువ్య వీధిపోటు 7. ఉత్తర వాయువ్య వీధిపోటు.

ఈ విధమైన శుభ మరియు అశుభకరమైన వీధిపోట్లు గాక కొన్ని వీధి పోట్లు దొంగ లాగా ఇంటిని తగులుతుంటాయి. వీధులు కాని వీధిపోట్లు ఇవి. వీధిలా కనపడకుండా గృహానికి వీధిపోటు తగులుతుంటుంది.

## ఈశాన్య వీధిపోటు

రాజు గారి ఏనుగు దండను పట్టుకొని కాబోయే రాజు కోసం ఊరంతయూ తిరిగినదట. ఆ సమయంలో పట్టణ జనులందరూ ఎవరో అదృష్టవంతుడు, ఎవరి మెడను పూలమాల వరిస్తుందో, రాజ్యలక్ష్మి వరిస్తుందో అనుకుంటూ చర్చించుకొని తమ అదృష్టాన్ని పరీక్షించుకోవడానికి గజవాహనం ముందుకు వెళ్లడం జరుగుతుందట. అలాగే అంతటి అదృష్టాన్ని ఈశాన్య వీధిపోటు గృహస్థులకు కలుగజేస్తుంది. గృహమునకు ఉత్తరము, తూర్పునకు మధ్య గల ప్రాంతమును ఈశాన్యము అంటారనే విషయము మీకు తెలుసు. ఖచ్చితముగా ఈశాన్య మూలకు తగిలే వీధిపోటును ఈశాన్య వీధిపోటు అంటారు. ఈశాన్య వీధిపోటు ఉన్న గృహస్థులు అదృష్టవంతులుగా చెప్పవచ్చును. ఒకవేళ మీ దృష్టికి ఇటువంటి గృహములు అమ్మకమునకు వచ్చినచో తప్పకుండా కొనండి. సాధారణంగా ఇటువంటి గృహాలు అమ్మకానికి ఉండవు. ఒకవేళ అమ్మకమంటూ జరుగుచున్నచో అమ్మువారు విదేశాలకు వెళ్ళిపోతూ లేదా ఇతర దూర ప్రాంతాలకు వెళ్ళిపోతూ అమ్మవలసిందే కానీ ఏ ఇతర దుష్పరిణామములు జరిగి అమ్మకం చేయడమనేది ఉండదు. ఈశాన్య వీధిపోటు గృహములకు శుభములు తప్ప అశుభములు ఉండవు. ఈ గృహమువారు వాస్తురీత్యా గృహాన్ని నిర్మాణం కావించుకొనివుంటే భూలోక వైకుంఠముగా వీరి గృహము వర్ధిల్లుతుంది.

శుభఫలితములు :- మనశ్శాంతి, నిరంతర ధనవృద్ధి, విదేశాలకు వెళ్ళడం, వంశాభివృద్ధి, పట్టిన ప్రతి పనిలోనూ విజయం, దోషాలు లేని కార్యములు, హృదయ ఆనందం, విద్యలో పిల్లలు అందరికన్నా ముందుండడం, భోగభాగ్యాలు, సకల సంపదలు, యశస్సు, కీర్తి, తేజస్సు, ఆనందం.

ఈశాన్య వీధిపోటు గల గృహాలు మీకు కొనడానికి లభించకపోయినట్లయితే కనీసం కిరాయికి లభించినా ఆలస్యం చేయక వెంటనే మీరున్న ఇల్లును వదిలి ఇటువంటి గృహములలో చేరుకోవడంవల్ల పై చెప్పుకున్న శుభఫలితములను మీరు అందుకోవచ్చు. ఇటువంటి గృహములకు కాస్త కిరాయి ఎక్కువైననూ ఆలోచన చేయవద్దు. సంవత్సరం కిరాయి ఒక రోజులో సంపాదించుకోవచ్చు. ఎవరు చెప్పొచ్చారు. ఇటువంటి గృహాలలో ఎన్నెన్నా విచిత్రాలు జరిగి గృహస్థులను ఉన్నతులను చేస్తుంది. తరాల కొద్దీ ఇటువంటి గృహాలలో నివశించే అవకాశమొస్తే మీ వంశంలో జన్మించే వారి గురించి చెప్పాల్సిన అవసరం ఉండదు. ఉన్నతులు, మహోన్నతులు, బుద్ధిమంతులు, జ్ఞానజీవులు జనిస్తారు. ఆజన్మాంతం ధన నిల్వలు.

## తూర్పు ఈశాన్య వీధిపోటు

అదృష్టం వరించాలన్నా, విదేశాలకు వెళ్లాలన్నా, పిల్లల భవిష్యత్తు అద్భుతంగా వుండాలన్నా తూర్పు ఈశాన్య వీధిపోట్లు గల గృహము యందు నివాసముండండి. గృహమునకు తూర్పు ఈశాన్య ప్రాంతము నుండి వీధిపోటు తగులు తున్నట్లయితే ఆ వీధిని తూర్పు ఈశాన్య వీధిపోటు అని అంటారు. ఈ తూర్పు ఈశాన్య వీధిపోటు ఈశాన్య వీధిపోటుతో దాదాపుగా సమానంగా ఉంటుంది. ఈశాన్య వీధిపోటు ఇచ్చే శుభఫలితాలలో చాలా భాగము కూడా తూర్పు ఈశాన్య వీధిపోటు గృహస్థులకు అందిస్తుంది. ఇటువంటి గృహములు కూడా మీకు ఎక్కడైనా అమ్మకానికి కనిపిస్తే వెంటనే కొనేయండి. సాధారణంగా ఇటువంటి గృహాలు అమ్మకానికి రావు.

శుభ ఫలితములు :- విదేశీయానం, ధనవృద్ధి, కీర్తి ప్రతిష్ఠలు, వంశాభివృద్ధి, ఉన్నత విద్య, మర్యాద, గౌరవము, ఆనందము, సంతోషము, భోగభాగ్యాలు ఇతరత్రా. ఇటువంటి గృహాలు మీకు కొనడానికి లభించకపోయినట్లయితే కనీసం బాడుగకైనా ఉండండి. సంవత్సరాల తరబడి ఇలాంటి గృహాలలో ఉండే అవకాశమొస్తే మీ వంశంలో జన్మించే వారు బుద్ధి జీవులు, కీర్తి ప్రతిష్ఠలు కలవారు, మహోన్నతులు, జ్ఞానజీవులు అవుతారు. ఆజన్మాంతం కీర్తి ప్రతిష్టలతో పాటు ధన నిల్వలు కలిగి ఉంటాయి.

## తూర్పు వీధిపోటు

చిన్న పొరపాటు జరిగిననూ తూర్పు వీధిపోటు తూర్పు ఆగ్నేయ వీధిపోటుగా సంతరించుకుంటుంది. తూర్పు వీధి, దక్షిణ వీధి, పశ్చిమ వీధి, ఉత్తర వీధుల విషయంలో జాగ్రత్తలు తప్పనిసరిగా తీసుకోవాలి. చాలా చిన్న పొరపాటు జరిగిననూ శుభ ఫలితములు కాక అశుభ ఫలితములు వచ్చు అవకాశము ఎక్కువ. తూర్పు వీధి గృహమునకు తూర్పు భాగము నుండి వీధి వచ్చి మన గృహమునకు తగులుతున్నచో ఆ వీధిని తూర్పు వీధిపోటు అంటారు. ఇది కూడా శుభ ఫలితములనిచ్చే వీధిపోటే. అయితే ఈ వీధిపోటు చిన్నపాటిగా ఆగ్నేయ దిక్కుకు జరిగినా తూర్పు వీధిపోటు శుభలక్షణములు కాక ఆగ్నేయ వీధిపోటు లక్షణాలను కలిగి ఉంటుంది. గృహమునందు వాస్తు బాగా పాటించి ఉన్నట్లయితే ఇటువంటి తూర్పు వీధి వల్ల శుభ ఫలితములు పొందే అవకాశం బాగా ఉంటుంది. అదే వాస్తు సరిగా లేకపోయినట్లయితే ఈ తూర్పు వీధిపోటు వల్ల ఆశించినంత శుభఫలితములు పొందగలము అని చెప్పడం కష్టం.

ఈ వీధిపోటు ఎలాంటిదంటే ఒక వ్యాపారి తక్కెడ (త్రాసు) తూకము వేసేటప్పుడు చివరికి బ్యాలన్స్ అయ్యి రెండు సరిసమాన స్థాయిలో నిలబడతాయి. ఎటుపక్క కొద్దిగా పదార్థం వేసిననూ అటుపక్క త్రాసు మొగ్గుతుంది. ఇదే విధంగా తూర్పు వీధిపోటు కూడా గృహస్థులకు ఫలితాలను ఇస్తుంది. దీని పూర్తి ఫలితములు అందుకోవాలంటే గృహాన్ని వాస్తురీత్యా నిర్మించుకోవాలి.

శుభ ఫలితాలు :- కీర్తి ప్రతిష్టలు కలుగజేయడం, పట్టుకున్న పనులు సంపూర్ణంగా ముగియడం, సంప్రదాయాలను పాటించడం, విద్య, తదితరములు.

## తూర్పు ఆగ్నేయ వీధిపోటు

ఏదైనా ఒక శిక్ష అమలు కావడాన్ని చూసినచో పగవాడికి కూడా వద్దు ఈ శిక్ష అనుకోవడము కద్దు. అలాగే ఏదైనా బాధకు గురైనప్పుడు పగవాడికి కూడా ఈ బాధ వద్దు అనుకోవడము జరుగుతుంది. అలాంటి అనుభూతిని ఈ తూర్పు ఆగ్నేయ వీధిపోటు ఇస్తుంది. తూర్పు వీధి గృహమునకు తూర్పు ఆగ్నేయము నుండి వీధి తగులుతున్నచో దానిని తూర్పు ఆగ్నేయ వీధిపోటు అంటారు. ఈ వీధిపోటును మాత్రము కచ్చితముగా పోటు అనవలసిందే. ఎందుకంటే ఈ వీధిపోటు వల్ల గృహస్థుడు నరక యాతనను ప్రత్యక్షంగా అనుభవించాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. సాధారణంగా ఇటువంటి గృహాలు అమ్మకానికి వస్తుంటాయి. ఒకవేళ మీ దృష్టికి ఇటువంటి గృహములు వస్తే దయచేసి కొనవద్దు. దీని వలన ఎటువంటి శుభ ఫలితములు ఉండవు. గృహము వాస్తురీత్యా నిర్మిస్తే కాస్తలో కాస్తైనా దీని రాక్షస బలము నుండి విశ్రాంతి తీసుకొనే అవకాశం ఉంటుంది. అదే గృహములో వాస్తు పాటించక పోతే వీధిపోటు రాక్షస శక్తిని కలిగి గృహస్థుని పీల్చి పిప్పి చేస్తుంది.

అశుభఫలితములు :- పరిష్కారము కాని సమస్యలతో నరకయాతన అనుభవించడం, చట్టవ్యతిరేకమైన పనులు చేయడం అసంతృప్తికర జీవనం, క్రోధము, కోపము, పనుల ఆటంకము, విపరీతమైన ఖర్చు, ప్రతి ఒక్క విషయం లోనూ అతికిపోవడం, విపరీతమైన కామం, జైలుకెళ్ళడం, అవిద్య, నిందలు, మద్యసేవనం, పొగ విపరీతంగా త్రాగడం, మెట్టినింటికి వెళ్లిన ఆడ పిల్లలు బాధలకు గురి కావడం ఇతరత్రా.

## ఆగ్నేయ వీధిపోటు

కష్టానికి చిరునామా, బాధలకు పుట్టినిల్లు లాంటి ఫలితాలను ఆగ్నేయ వీధిపోటు ఫలితాలను రుచి చూడాలి. సంఘ విద్రోహికి సరైన శిక్ష అంటే ఆగ్నేయ వీధిపోటు గల గృహములో పెడుతూ ఇంకొన్ని “అవాస్తు” లక్షణాలను కలుగజేస్తే దెబ్బకు వెదవ బోనులో పడిన ఎలుకలా తయారు కాగలడు.

రుచి చూసిన వాడికే ఉండేలు దెబ్బ యొక్క శక్తి అర్థమవుతుంది. అలాగే ఆగ్నేయ వీధిపోటు గల గృహములో ఎంతటి కష్టాన్ని ఎదుర్కుంటారో ఆ గృహంలో నివసించు గృహస్థులు బాగా చెప్పగలరు. గృహమునకు ఆగ్నేయ భాగమునుండి వీధి వచ్చి తగులుచున్నచో ఆ వీధిని ఆగ్నేయ వీధిపోటు అంటారు. ఈ ఆగ్నేయ వీధిపోటు తూర్పు ఆగ్నేయ వీధిపోటుకు ఏ మాత్రం తీసిపోక ఇంకాస్త ఎక్కువగా దుష్ఫలితముల ప్రభావమును గృహస్థునిపై చూపిస్తుంది. ఈ గృహము ద్వారా ఎటువంటి శుభ ఫలితములు గృహస్థునికి అందవు. ఫలితములంటే దుష్ఫలితములు మాత్రమే గృహస్థుడు విందు భోజనం ఆరగించి నట్లు ఆరగించాల్సి వస్తుంది. ఇటువంటి గృహాలు అమ్మకమునకు వచ్చినప్పుడు తీసుకోవద్దు. ఇటువంటి గృహాలలో బాడుగకు కూడా చేరవద్దు. అంతెందుకు చెడు వీధిపోట్లు కలిగిన ఏ గృహాల యందును బాడుగకు కూడా చేరవద్దు. వాస్తు పట్టు కలిగిన గృహముయందు కూడానూ ఈ ఆగ్నేయ వీధిపోటు వలన దుష్ఫలితములను అనుభవించాల్సిన పరిస్థితులు దాపురించే అవకాశం ఎక్కువ. ఉన్నతుడు ఈ గృహములో నివశించిననూ కొద్ది కాలానికి భ్రష్టు పట్టి పోతాడు.

**అశుభ ఫలితాలు :-** ప్రతి ఒక్క విషయం లోనూ అతికిపోవడం, విపరీతమైన కామం, జైలుకెళ్ళడం, అవిద్య, నిందలు, వ్యభిచరించడం, పరిష్కారము కాని సమస్యలతో సతమతమవడం, అసంతృప్తికర జీవనం, క్రోధము, కోపము, పనుల ఆటంకము, విపరీతమైన ఖర్చు, కొట్లాటలు, జగడాలు, రక్తము కారునట్లుగా కొట్టుకోవడం, కోర్టు కేసులు, ఆడపిల్లలు పుట్టింటికి ఏదో కారణంచే చేరడం, ఇతరత్రా.

## దక్షిణ ఆగ్నేయ వీధిపోటు

జనాకర్షణ, సక్రమ ధన సంపాదన, ఏదో ఒక గొప్ప కార్యం చేసి ప్రజలచే కీర్తింపబడటం, ఇత్యాదివి దక్షిణ ఆగ్నేయ వీధిపోటు లక్షణాలు. గృహమునకు దక్షిణ ఆగ్నేయ భాగమునుండి వీధి తగులుచున్నచో ఆ వీధిని దక్షిణ ఆగ్నేయ వీధిపోటు అంటాము. కొందరు ఈ దక్షిణ ఆగ్నేయ వీధిపోటు శుభకరము కాదని తెలుపుతారు. అయితే నా పరిశోధనలో ఎన్నో గృహములలో దక్షిణ ఆగ్నేయ వీధిపోట్ల వల్ల శుభములు జరిగినవే కానీ, అశుభముల శాతం లేదు.

**శుభ ఫలితములు :-** జనాకర్షణ, ధనాదాయము, ధర్మ చింతన సంపాదన, న్యాయంగా ధనాన్ని ఆర్జించడం, రూపాయి సంపాదనకు పోతే నాలుగు రూపాయలు లభించడం, ఆరోగ్యాలు బాగుండడం, స్త్రీలు సుఖించడం, ఆడపిల్లలకు త్వరగా పెళ్ళిళ్ళు కావడం తదితరములు. ఇదే గృహమునకు తూర్పున బాగా ఖాళీ ఉన్నట్లయితే మగవారికి సంఘములో గౌరవము, ప్రతి ఒక్క పని యందు పనివారు శ్రద్ధగా పనిచేయడం.ధనము బాగా

కూడుకోవడము, ఇచ్చిన బాకీలు త్వరగా వసూలు కావడం, భద్రతా భావము ఉండడం, ఆరోగ్యము చక్కగా ఉండడం, బంధువులు, మిత్రుల, రాకపోకలు, దూరప్రాంత ప్రయాణాలు, ఇతరత్రా.

## దక్షిణ వీధిపోటు

ఇంతకుముందు మనము తూర్పు వీధిపోటులో చదువుకున్నట్లుగా దక్షిణ వీధిపోటు విషయంలో కూడా జాగ్రత్తలు తీసుకోవలసిందే. దక్షిణ గృహమునకు దక్షిణ భాగము మధ్య నుండి వీధి వచ్చి గృహమునకు తగిలినచో ఆ వీధిని దక్షిణ వీధిపోటు అందురు. దీనివల్ల కీడులేదు. అయితే చిత్ర విచిత్రమైన కాంబినేషన్లు గల గృహములను మనము ఊళ్లయందు గమనించ వచ్చును. పై విషయం చెప్పడానికి కారణం దక్షిణ వీధిపోటు గల గృహమునకు, వీధిపోటుకు పశ్చిమ భాగములో గృహములు ఉండి, తూర్పు భాగమునకు గృహములు లేకుండా పోతే ఒక ఫలితము, ఈ ఫలితములు శుభకరముగా ఉండును. ఇదే వీధిపోటుకు పశ్చిమ దిక్కున బయలు ప్రదేశములు ఉండి తూర్పు దిక్కున మేడలు ఉన్నట్లయితే ఈ వీధిపోటు గృహమునకు శుభము చేయడానికి కష్టమని చెప్పవచ్చును. ఇదే దక్షిణ వీధిపోటు కాస్త నైఋతి దిక్కుగా జరిగితే ఫలితములు ప్రమాదకరముగా ఉండును. ఇదే దక్షిణ వీధిపోటు కాస్త ఆగ్నేయ దిక్కుగా జరిగివుంటే ఫలితములు శుభకరముగా ఉండి గృహస్థులు సుఖశాంతులతో ఉందురు. ఈ దక్షిణ వీధి గల గృహమునకు ఉత్తరము ఖాళీ ఉంటే గృహస్థులు భోగభాగ్యా లతో సుఖసంతోషాలతో ఉందురు. ఒకవేళ ఉత్తరము ఖాళీ స్థలము లేకపోతే ఈ వీధిపోటు వల్ల ఎక్కువ ప్రయోజనం వొనగూరుతుందని భావించడానికి వీలు లేదు.

## దక్షిణ నైఋతి వీధిపోటు

40 సంవత్సరాలుగా ఒక వ్యక్తి చేతిలో ధనం బాగా వుండి విచ్చలవిడిగా ఖర్చు పెట్టి డబ్బు అడిగిన తక్షణం తండ్రి కావాల్సినంత ఇచ్చి విచ్చలవిడి ఖర్చుకు తోడ్పాటును అందిస్తే ఈ ఖర్చు పెట్టడానికి అలవాటు పడ్డ వ్యక్తి ఇక మిగిలిన జీవితంలో దేనికీ పనికి రాడు. అలాగే అతనికి ధనాన్ని అందజేస్తూ అతని దుబారా ఖర్చులకు ఇతోధికంగా సహాయం కావించిన తండ్రి మరణిస్తే ఈ ఖర్చు పెట్టే వ్యక్తి పరిస్థితి భయానకం. ఒక పాతాళంలో పడిపోయిన భావన కలుగకమానదు. చలనం నశిస్తుంది. అటువంటి పరిస్థితులు దక్షిణ నైరుతి వీధిపోటు వల్ల కలుగుతాయి. దక్షిణ నైరుతి వీధిపోటును ఆషామాషీగా తీసుకోరాదు. గృహమునకు దక్షిణ నైఋతి భాగము నుండి వీధి వచ్చి తగులుతున్నచో దానిని దక్షిణ నైఋతి వీధిపోటు అందురు. ఇవి రెండు రకాలు. ఒకటి స్వభావ సిద్ధంగా ఏర్పడిన దక్షిణ నైఋతి వీధిపోటు. రెండవది పశ్చిమ వీధికి గృహమును జరుపుతూ కట్టుకున్నట్లయితే ఏర్పడిన దక్షిణ నైఋతి వీధిపోటు. ఇంతియేగాక ఇలాగ పశ్చిమ దిక్కుకు గృహమును జరుపుతూ కట్టుకున్నట్లయితే ఒక్క దక్షిణ నైఋతి వీధిపోటే గాక చండాలమైన ఉత్తర వాయువ్య వీధిపోటు కూడా తగులుతుంది. కావున పశ్చిమ దిక్కుకు గృహమును జరుపుతూ కట్టుకోవడం చేయవద్దు. ఎక్కువ భాగము దక్షిణ నైఋతి వీధిపోటుతోపాటు ఉత్తర వాయువ్య వీధిపోటు కూడా గృహములకు తగులుతుంటాయి. ఈ విధమైన గృహముల యందు నివశించే గృహస్థులు అనేక విధములైనటువంటి బాధలకు గురి కావలసి ఉంటుంది. ఒకవేళ దక్షిణ నైఋతి వీధిపోటు మాత్రం గృహమునకు తగులుతున్నట్లయితే వాటి అశుభ ఫలితములు : 1. అభద్రతా భావం 2. అనారోగ్యం 3. ఆర్థిక ధన నష్టం 4. కొన్ని పరిస్థితులలో మరణాలు 5. స్త్రీలపై భయంకరమైన దుష్ప్రభావం 6. మానసిక అశాంతి.

## నైఋతి వీధిపోటు

10 కోట్ల రూపాయల ఆస్థి పరుడు. గృహములో అందరూ ధనవంతులుగా భావిస్తూ చాలా క్వాలిటీ గల వస్తువులను తెచ్చుకొని బోగభాగ్యాలను అనుభవిస్తూ వుంటారు. గృహములో అందరికీ ఇదే భావన ఉండవచ్చును. అకస్మాత్తుగా గృహ యజమాని దివాలా తీశాడని గృహ సభ్యులకు తెలిస్తే వారి మానసిక స్థితిని వారు కూడా వర్ణించడానికి వీలు కాదు. ఇటువంటి ప్రకంపనలనే ఈ నైరుతి వీధిపోటు కలుగజేస్తుంది. దివాలా అయినా కావచ్చు, మషాలా అయినా కావచ్చు. మనిషే పోవచ్చు. గృహమునకు కచ్చితంగా నైఋతి భాగమునుండి వీధి వచ్చి తగిలినచో ఆ వీధిని నైఋతి వీధిపోటు అందురు.

ఈశాన్య వీధిపోటు గల గృహాలను గమనిస్తే ఇదే ఈశాన్య వీధిపోటు వెనుక భాగములో ఇంకొక ఏదైనా గృహమునకు తగిలినచో ఆ వీధి తప్పకుండా ఆ గృహానికి నైఋతి వీధిపోటై సకల అవలక్షణాలను గృహానికి అపాదింపజేస్తుంది. ఒకటే వీధి ఒక గృహానికి అద్భుతమైన ఫలితాలిచ్చి ఇంకొక గృహాన్ని సర్వ నాశనం కలిగించడాన్ని చూస్తే ఏమీ తెలియనటువంటి వీధికి ఇంత బలముందా అని అనిపిస్తుంది. గృహమునకు ఎప్పటికీ నైఋతి భాగములో బలమైన కట్టడములు, ఉప గృహములు బలమైన వృక్షాలు ఉండవలసి ఉంటుంది. అలాగైతే మంచి ఫలితాలు గృహస్థులకు అందుతాయి. దీనికి వ్యతిరేకముగా ఇలా గృహమునకు నైఋతి వీధిపోటు ఉన్నచో గృహస్థులకు చావు దెబ్బలుతప్పదు. కచ్చితమైన సమయాన్ని చెప్పలేము కానీ అయితే తప్పకుండా నైఋతి వీధిపోటు దుష్ఫలితాలు గృహస్థులు అనుభవించాల్సి ఉంటుంది. ఉదాహరణకు భయంకరమైన రోగాలు, క్యాన్సరు, పక్షవాతము, గుండెపోటు, ఘోరమైన ఆర్థిక పతనము, ఆలోచనలను నశింప చేయడం, దుర్వ్యసనాలు, చేతికొచ్చిన పిల్లలు మంచి సమయాలలో దెబ్బ తినడం, ఆక్సిడెంటు మరణాలు, అభద్రతా భావము, ప్రశాంతతా లోపము.

## పశ్చిమ నైఋతి వీధిపోటు

ఒక కుటుంబంలో ఆరు మంది సభ్యులు వీరందరూ ఒక వ్యక్తిపై ఆధారపడ్డారు. అతను సంపాదిస్తే వీరందరూ తింటారు. అటువంటి కుటుంబంలో సంపాదించు వ్యక్తి ఒకానొకనాడు పక్షవాతంతో కుప్పకూలిపోతాడు. కుటుంబ పోషణకు భారం కావడము, వైద్యుల ఖర్చు, అప్పుడు వారి పరిస్థితి దిక్కు తోచకుండా తయారు అవుతుంది. ఇటువంటి పరిస్థితులే పశ్చిమ నైరుతి వీధిపోటుతో ఏర్పడును. పశ్చిమ నైఋతి భాగము నుండి వీధి వచ్చి తగులుతున్నచో దానిని పశ్చిమ నైఋతి వీధిపోటు అందురు. ఇటువంటి గృహములు ఎన్నిటినో మనము గమనించవచ్చును. ప్రకృతి సిద్ధముగా ఏర్పడిన పశ్చిమ నైఋతి వీధిపోటు ఒకటి, స్వతహాగా మనకై మనము ఏర్పాటుచేసుకున్న పొరపాటు వల్ల ఏర్పడిన పశ్చిమ నైఋతి వీధిపోటు ఇంకొకటి. ఎలా అనగా ఏదైనా గృహమును దక్షిణ భాగమునకు జరుపుతూ కట్టు కున్నట్లయితే లేదా దక్షిణ వీధిలోనికి గృహము పొడుచుకొని వచ్చినప్పుడు ఆ గృహమునకు చండాలమైన రెండు వీధిపోట్లు పడును. ఒకటి పశ్చిమ నైఋతి వీధిపోటు రెండవది తూర్పు ఆగ్నేయ వీధిపోటు. ఈ విధమైన గృహముయందు నివసించు గృహస్థులకు మూలిగే నక్కపై నిండు తాటిపండు పడిన చందంగా రోజుకు ఓ దరిద్రము చుట్టుకోవడం, దానిని మాపుకొనేలోపే ఇంకొకటి సిద్ధంగా ఉండి కొరుక్కు తినడం సంభవిస్తాయి. పశ్చిమ నైఋతి వీధిపోటు

వల్ల గృహస్థులు అనేక బాధలకు గురికావలసి ఉంటుంది. ముఖ్యంగా ఇంటి పెద్దపై ఈ దుష్పరిణామము ఎక్కువగా ఉంటుంది. ఉదాహరణకు కష్టపడి పనిచేసే మగవాడు అకస్మాత్తుగా పక్షవాతం దెబ్బతిని నేలపడిపోవడం, ఆర్థిక పతనం, మానసిక అశాంతి, క్షోభ, కుమారులున్నచో వారిపై విపరీతమైన దుష్ప్రభావాలు, అభద్రతా భావము, ఆడవారికి టెన్షన్లు, కుటుంబము యందు కలహాలు.

## పశ్చిమ వీధిపోటు

గృహములోని సభ్యులకు ఏదైనా ఒక సమస్య బయటి వ్యక్తుల నుంచి వచ్చి ఆ సమస్య ఏకుగా వచ్చి మేకు అయి కూర్చున్నచో ఆ కుటుంబ సభ్యుడు ఆ సమస్య వల్ల సతమతమై నలిగిపోతూ ఉంటాడు. ఇటువంటి పరిస్థితులలో గృహము యందలి పెద్దకు విషయం తెలిసి ఆ సమస్యను పరిష్కరించినచో సమస్య వల్ల బాధ పడుతున్న కుటుంబ సభ్యునికి వచ్చే ఆనందం అంతా ఇంతా కాదు మరియు కుటుంబ పెద్దపై విపరీతమైన గౌరవభావములు ఏర్పడును. ముఖ్యంగా భద్రతాభావము ఏర్పడును. సాధారణ సమయాల్లో భద్రతాభావమంటే అర్థం తెలియక పోవచ్చు. కష్టాలు వచ్చినప్పుడు భద్రతాభావం యొక్క విలువ చాలా బాగా అర్థమగును. పశ్చిమ వీధిపోటు గృహ పెద్దగా వ్యవహరించి కుటుంబాన్ని కాపాడుకొనును.

చాలా మంది పశ్చిమ వీధిపోటు వల్ల గృహస్థులు అనేక విధాలా బాధలకు గురి అవుతారని తెలుపుదురు మరియు కొన్ని వాస్తు పుస్తకాలలో కూడా పశ్చిమ వీధిపోటు మంచిది కాదని తెలపడమైనది. ఈ విషయాన్ని బాగా పరిశీలన చేసి **"వీధిపోట్లు – ఫలితాలు"** అను వాస్తు పుస్తకంలో వివరంగా తెలపడమైనది.

గృహమునకు పశ్చిమ దిక్కునుండి వీధి వచ్చి తగిలినచో దానిని పశ్చిమ వీధిపోటు అందురు. గృహమునకు ఈ వీధిపోటు కచ్చితంగా మధ్య భాగమునకు తగిలినచో శుభకరముగా ఉండును. ఇదే వీధిపోటు కాస్త నైఋతి భాగమునకు జరిగినచో దుష్పరిణామములను ఎదుర్కోవలసి ఉంటుంది. ఒకవేళ ఇదే వీధిపోటు కాస్త వాయువ్య భాగమునకు జరిగినచో శుభ ఫలితముల శాతము ఎక్కువగా ఉండును. పశ్చిమ వీధిపోటు ఉన్న గృహస్థులు గృహమునకు తూర్పు భాగమున ఎక్కువ ఖాళీ స్థలము ఉంచుకున్నచో అనేక విధములైనటువంటి శుభ ఫలితములు లాభములు పొందుదురు. మరియు ఉత్తర భాగమున ఖాళీ స్థలమున్నచో భోగ భాగ్యాలు, సుఖసంతోషాలు, యశస్సు, కీర్తి, ధనాదాయము, కలిసి వచ్చే ప్రయాణాలు, ఇంట ఆడవారి సంతోషం, కలిసి ఉంటే కలదు సుఖంలా గృహము నడుస్తుంది. ఈ గృహమునకు పొరపాటుగా పశ్చిమ భాగమున గోతులున్నచో, తూర్పున ఖాళీ స్థలము లేకపోయినచో చాలా దుష్పరిణామములను అనుభవించవలసి ఉంటుంది. ఉదాహరణకు పక్షవాతము, మరణము. ఒకవేళ ఉత్తరమున ఖాళీ లేకపోతే పూచీలు పడి నాశనం కావడం, ఇంతే కాక బంధుమిత్రుల మధ్యలో అవమానాలు.

## పశ్చిమ వాయవ్య వీధిపోటు

మామూలు గృహస్థులకు ఒక నాయకుడు నివసించు గృహస్థులకు మధ్య తేడా చాలా వుంటుంది. పశ్చిమ వాయవ్య వీధిపోటు నాయకత్వ లక్షణాలను అందిస్తుంది. గృహమునకు పశ్చిమ వాయువ్య భాగమునుండి వీధి వచ్చి తగిలినచో దానిని పశ్చిమ వాయువ్య వీదిపోటు అందురు. ఈ వీధిపోట్లలో రెండు రకములు గలవు. ఒకటి స్వభావ సిద్ధంగా ఏర్పడినది. రెండవది మనకై మనము ఏర్పాటు చేసుకున్నందు వల్ల ఏర్పడిన వీధిపోటు. ఇది ఎలాగంటే గృహము ఉత్తర వీధికి జరుగుతూ కట్టుకున్నప్పుడు, ఆ గృహమునకు పశ్చిమ వాయువ్య వీధిపోటు మరియు తూర్పు ఈశాన్య వీధిపోటు తగులును. ఈ విధంగా గృహము ఉన్నచో ఆ గృహస్థులు  అష్టైశ్వర్యాలతో, భోగభాగ్యాలతో, సకల శుభ సంతోషాలతో, కీర్తి ప్రతిష్టలతో తులతూగుదురు. పశ్చిమ వాయువ్య వీధిపోటు గృహస్థుడిని విజయానికి చేర్చును. నైఋతి భాగమున గృహములు ఉన్నందువల్ల ఆ గృహములు ఈ గృహానికి శుభము కలుగచేయును.

## వాయవ్య వీధిపోటు

కొత్తగా పెళ్లి అయి మెట్టినింటికి వచ్చిన పెళ్లికూతురు తన భర్త గురించి తన వైవాహిక జీవితం గురించి రకరకాల రంగుల కలలు కని వుంటుంది. పెళ్లికుమారుని పరిస్థితి అత్యంత బ్రహ్మాండమని మధ్యవర్తులు తెలిపి పెళ్లి చేశారు. మెట్టినింట కాలు పెట్టిన పెళ్లి కూతురికి తన భర్త భయంకరమైన అప్పుల్లో ఉన్నాడని తెలిసి మరియు మొత్తం భాగస్వాముల వ్యవహారాలు నిండా ఉండి గంటలు గడవకముందే కుటుంబంలో కలహాలు రేగి తన కళ్లముందే పెళ్లి కుమారున్ని నానా విధాలుగా అవమానపరుస్తూ పసుపు బట్టలు తీయకముందే చేయి చేసుకున్నంత పనిని అప్పులు వాళ్లు చేయడమో లేదా తన్నడమో తన కళ్లముందరే జరిగితే ఆ పెళ్లికూతురి మానసిక పరిస్థితి ఎంత దారుణంగా వుంటుందో అనుభవిస్తే తప్ప తెలియకపోవచ్చు. అటువంటి పరిస్థితులను ఈ వాయవ్య వీధిపోటు కలిగించే అవకాశము ఎక్కువ. గృహమునకు వాయువ్య భాగమునుండి వీధి వచ్చి తగిలినచో ఆ వీధిని వాయువ్య వీధిపోటు అందురు. ఈ వీధిపోటు వల్ల గృహస్థులకు ఎటువంటి శుభము జరుగకపోగా అశుభ ఫలితములు ఎక్కువగా ఉండును. ఇటువంటి వీధిపోటు ఉన్న గృహము వారు గృహము యందు వాస్తు పట్టు కలిగిన నిర్మాణము కావించుకుని ఉన్నట్లయితే ఈ వీధిపోటు ప్రభావం కాస్త తగ్గి గృహస్థులు ఊపిరి పీల్చుకొనే అవకాశము కలుగజేయును.

అశుభాలు :- పూచీలు పడి ఉన్నది ఊడగొట్టుకోవడము, కలహాలు, మానసిక క్షోభ, పిచ్చి పట్టడం, సన్యాసం, జైలుకు వెళ్లడం, ఊహాలోకాల్లో తేలిపోవడము.

## ఉత్తర వాయవ్య వీధిపోటు

అన్ని విషయాలలోనూ అద్భుతంగా జరుగుతూ వుంటుంది. వ్యాపారం బ్రహ్మాండంగా జరుగుతూ వుంటుంది. ఇక ఏ కష్టమూ లేదు. అయితే ఆ వ్యాపారి దివాళా తీశాడు. అద్భుతంగా జరుగుతున్న వ్యాపారము మన కళ్లముందరే ఆ వ్యాపారి దివాళా తీయడం, ఇవి నమ్మలేని నిజాలుగా మనకు మిగిలిపోవడం జరుగుతుంటాయి. శత్రువు యొక్క పెద్దన్నలా ఇటువంటి పనులను ఉత్తర వాయవ్య వీధిపోటు కలుగజేస్తూ వుంటుంది. గృహమునకు ఉత్తర వాయువ్యమునుండి వీధి వచ్చి తగిలినచో ఆ వీధిని ఉత్తర వాయువ్య

వీధిపోటు అందురు. దక్షిణ నైఋతి వీధిపోట్లలో చర్చించుకున్న విధముగా గృహము పశ్చిమ భాగమునకు జరుపుతూ నిర్మించుకున్నచో ఉత్తర వాయువ్య వీధిపోటు గృహమునకు తగులగలదు. నిర్మాణము చేయడానికి ముందే ఓ మంచి వాస్తుశాస్త్రవేత్త సలహా తీసు కున్నట్లయితే ఇటువంటి పొరపాట్లు జరుగకుండా జాగ్రత్తలు సూచించగలడు. లేనిచో జీవితాంతము నరక ప్రాయంగా గడుస్తుంది. ఒకవేళ మీ గృహమునకు ఉత్తర వాయువ్య వీధిపోటు తగులుతున్నచో అనుభ వజ్ఞుడైన వాస్తు శాస్త్రవేత్తచే గృహాన్ని పరిశీలింప చేయించుకొని తగిన తరుణోపాయాన్ని పొంది సుఖజీవనాన్ని అనుభవించండి. ఉత్తర వాయువ్య వీధిపోటువల్ల ఏ శుభమూ జరుగకపోగా, అన్నీ అశుభములు జరుగుతూ విపరీతమైన ఇబ్బందులకు గృహస్థులను గురిచేయును.

వాయువ్య వీదిపోటు వలె ఈ ఉత్తర వాయువ్య వీధిపోటు కూడా గృహస్థులను ఆర్థిక పతనానికి గురిచేస్తుంది. ఉదాహరణకు ఒక వ్యాపారం స్థాపించడం, త్వరలోనే అది బాగా జరుగడము, ఈ పరిణామమును చూసి వ్యాపారమును బాగా అభివృద్ధి చేయాలనే ఉద్దేశ్యంతో ఎక్కువ మొత్తమును అప్పుగా తీసుకువచ్చి వ్యాపారంలో పెట్టడం, నిండా మునిగిపోవడం, ఊహించని విధంగా వ్యాపారనష్టం సంభవిస్తుంది. ఇటువంటి వీధిపోట్లు గల గృహములందు స్పెక్యులేషన్ (షేర్లు, స్టాక్ పెట్టడం) వ్యాపారాలు చేయరాదు. ఘోరమైన మానసిక క్షోభ, లేనిదానికై ఆశించడం, ఊహల్లో తేలిపోవడం, ఆడపిల్లలచే ఇబ్బందులు, మగవారి సన్యాసం, పిచ్చిపట్టడం, అప్పిచ్చినవాడు ఎప్పుడు వస్తాడోనని, ఏమంటారోనని భయం భయంగా ఉండడం, వీధి వాకిలి శబ్ధముతోటే భయపడటం జరుగుతాయి.

## ఉత్తర వీధిపోటు

చేస్తున్న పనుల్లో, వ్యాపారాలలో బాగా కలిసి రావడములో ఉత్తర వీధిపోటు అందివుచ్చికుంటుంది. గృహమునకు ఉత్తర భాగము నుండి వీధి వచ్చి తగిలినచో దానిని ఉత్తర వీధిపోటు అందురు. ఈ ఉత్తర వీధిపోటు గృహాలకు ఉత్తరము ఖాళీ స్థలము ఉంచుకున్నచో ఫలితములు అద్భుతముగా ఉండి అన్ని విషయాలలో ఆనందాన్ని పొందవచ్చును. ముఖ్యంగా ఉత్తర వీధిపోటు గృహస్థులు దక్షిణభాగము యందు బలమైన రాతి నిర్మాణములను లేదా బలమైన వృక్షాలను పెంచుకున్నట్లయితే ఊహించని విధముగా ధనము కూడును.

## ఉత్తర ఈశాన్య వీధిపోటు

ఏదైన ఒక వ్యవహారంలో ఒక వ్యక్తికి అద్భుతంగా జరుగుబాటు అయితే పక్కనున్న వారు ఏంటండీ నక్క తోక తొక్కి వచ్చారా! ఉన్న ఫళానా గోల్డెన్ చాన్స్ కొట్టారే అని అడుగుతుంటారు. నక్క తోకను తొక్కితే అదృష్టం వస్తుందో రాదో తెలియదు కానీ నక్క తోకను తొక్కితే మాత్రం కండలూడేలా అది కరవక తప్పదు. ఒక్కసారి మీ రక్త మాంసాలకు అలవాటు పడిందంటే మీ ఇంటి అడ్రస్‌ను ఓపికగా వెతికి మరీ మీ కండలను తీరిగ్గా ఆరగిస్తుంటుంది.

నక్క తోకను తొక్కడము అను మాట ఒక నానుడి. ఇటువంటి ఒరవడి గల ధన లాభాలను అందించు శక్తిని ఉత్తర ఈశాన్య వీధిపోటు గల గృహము కలిగి వుంటుంది.

కొందరికి ఉత్తర ఈశాన్య వీధిపోటు గల గృహము ఉన్ననూ వారు దాని శక్తిని శతధా వాడుకోలేరు. కారణం వాస్తు వారికి తెలిసినట్లుగా ఇతరులకు తెలియక పోవడమే. వారికి అంతా తెలుసు. అయితే నెత్తిపై

శని కూర్చొని ఉంటుంది. పొరపాటున కూడా ఒక అనుభవజ్ఞుడైన వాస్తు శాస్త్రవేత్తను పిలుచుకు వచ్చి గృహాన్ని పరిశీలింప చేయించుకొని అద్భుతమైన ఫలితాలను పొందాలి అను జ్ఞానము రాకపోవచ్చు. స్వయంగా నేను కొన్ని ఉదాహరణలు కూడా గమనించాను. వారి గృహము యందలి ఇతర నీచ దోషములే వారికి ఇటువంటి బుద్ధిని కలుగజేస్తూ వుంటాయి.

ఈశాన్య వీధిపోటు, తూర్పు ఈశాన్య వీధిపోటు, దక్షిణ ఆగ్నేయ వీధిపోటు, పశ్చిమ వాయవ్య వీధిపోటు, ఉత్తర ఈశాన్య వీధిపోటు గల గృహస్థులకు బాగుగా జరుగడం లేదు అంటే ఆ గృహములో ఏదో ఒక వాస్తు దోషము ఉన్నట్లే. ఒకవేళ మీ ఇలాకాలో ఇటువంటి పరిస్థితులు గల గృహాలు కనిపిస్తే వారికి ఓ మంచి సలహాను ఇచ్చినచో వారి జీవితాన్ని మీరు నిలబెట్టినట్లే.

గృహమునకు ఉత్తర ఈశాన్యము నుండి వీధి వచ్చి తగిలినచో దానిని ఉత్తర ఈశాన్య వీధిపోటు అందురు. ఒకటి స్వతహాగా ఏర్పడిన ఉత్తర ఈశాన్య వీధిపోటు, రెండవది మనకై మనము ఏర్పాటు చేసుకున్నది. గృహమును తూర్పు భాగమునకు జరుపుతూ నిర్మించుకొని ఉంటే ఉత్తర ఈశాన్య వీధిపోటు మరియు దక్షిణ ఆగ్నేయ వీధిపోటు ఉంటుంది. ఉత్తర ఈశాన్య వీధిపోటు ద్వారా గృహస్థులకు అనేక విధములైనటువంటి శుభములు సంభవించును. ఈ గృహమునకు తూర్పు భాగమున ఖాళీ స్థలమును ఉంచుకోవడం సర్వదా శ్రేయస్కరము. ఈ గృహము వల్ల అన్నీ శుభములే.

## ప్రహారీ

గృహమునకు ప్రముఖముగా వాస్తు శాస్త్ర రీత్యా భద్రతను కలుగజేయవలసిన ప్రాముఖ్యత ఎంతయో వుంది, ప్రహారీగోడ వాస్తుయందు అత్యంత ప్రాముఖ్యమైన స్థానమును ఆక్రమిస్తుంది. వాస్తు రెండు విధములు. గృహముయందలి వాస్తు, పరిసరవాస్తు. పరిసర వాస్తులో ఏమైనా దోషములున్ననూ అనగా గుంతలు, పల్లము, గుట్టలు, భారీ మేడలు ఇతరత్రా, వాటి దోష ప్రభావమును చాలా మటుకు ప్రహారీ గోడ ఆపుతుంది. కావునే గృహమునకు ప్రహారీ చాలా ముఖ్యము. పూర్వపు వాస్తు ఋషులు కూడా ప్రహారీగోడ విషయంలో ప్రత్యేకశ్రద్ధ తీసుకోవలసినదిగా తెలపడమైనది. గృహ నిర్మాణమునకు ముందే ప్రహారీగోడ విషయంలో తగిన జాగ్రత్తలు తీసుకున్నచో గృహస్థులకు భద్రత కలిగిన జీవనము లభిస్తుంది. గృహము ముందా ! ప్రహారీగోడ ముందా ! కచ్చితముగా ప్రహారీగోడనే ముందుగా కట్టాలి.

ప్రహారీగోడ నిర్మాణక్రమము :- వాస్తురీత్యా శుభకరమైన స్థలమును మీరు ఎన్నుకొన్న తరువాత, స్థలశుద్ధి గావించిన తరువాత, ఈశాన్య భాగముయందు గుంత గానీ, బావి గానీ, బోరు గానీ వేసిన తరువాత జరగాల్సిన పని ప్రహారీగోడ నిర్మాణం. ఈ ప్రహారీగోడకు నాలుగు గోడలు ఉండును. తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరము గోడలు. ఈ నాలుగు గోడలు కలిసి ఉన్నపుడే సంపూర్ణమైన ప్రహారీగోడ అగును. ఈ నాలుగు గోడలలో ఏ ఒక్క గోడ లేకపోయిననూ ప్రహారీగోడ సంపూర్ణత అనిపించుకోదు. స్థలమునందు దక్షిణము మరియు పశ్చిమము ఉన్నతంగా తూర్పు మరియు ఉత్తరములు పల్లముగా ఉండులాగున చూసుకోండి. ఒకవేళ మీ స్థలంలో పశ్చిమ, నైఋతి, దక్షిణములయందు భారీ వృక్షాలు ఉన్నచో వాటిని ఎటువంటి పరిస్థితుల లోను కొట్టివేయవద్దు. స్థలంనందు ఈశాన్య భాగాన్ని గుర్తించి అక్కడ బావి గాని, గుంట గాని, కుళాయి గుంత గాని, లేదా బోరు గాని వేసుకోవడం వలన అనేక శుభ ఫలితములు లభిస్తాయి. ఒకవేళ

ఈశాన్య భాగంలో ముందుగానే బావి ఉన్నచో దానిని పూడ్చరాదు.

దక్షిణ హద్దు సరిగా మూలమట్టమునకు $90^0$ ఉండాలి. ఇంటికి ప్రహరీ గోడ నిర్మించునప్పుడు పశ్చిమ, దక్షిణ హద్దులు మూలమట్టమునకు సరిగా ఉండునటుల సరిచూసుకొని తూర్పు, ఉత్తరములు పెరుగునట్లుగా ప్రహరీగోడ నిర్మించుకోవాలి. అప్పుడు తప్పనిసరిగా ఈశాన్య భాగము పెరుగుతుంది. తద్వారా అభివృద్ధి తథ్యం. ప్రహరీ నిర్మాణం దక్షిణ, పశ్చిమ గోడలు ఎత్తుగా ఉండునటుల మరియు ఉత్తర, తూర్పు గోడలు తక్కువ ఉండునటులగా నిర్మాణం గావించుకోవలెను. దీని ద్వారా నిర్మాణం అత్యంత త్వరగా ముగుస్తుంది పైగా పనివారు కూడా త్వరగా వచ్చి గృహ నిర్మాణమును పూర్తి చేయగలరు. అంతయే గాక నిర్మాణం అయిన తరువాత నివసించు గృహముయందలి నివాసితులు క్షేమకరంగా ఉందురు. ప్రహరీ నిర్మించుకొనే ముందు ప్రహరీ గేట్లు (ద్వారము) స్థలము దిక్కులకు ఉచ్ఛ స్థలములో ఉండవలెను. ఇల్లు నిర్మించు సమయములో లోనకు ట్రాక్టరు, ఇసుకబండి ఇతరత్రా వాహనములు వెళ్ళడానికి కాస్త విశాలంగా గేట్ల కొరకు స్థలమును వదిలి ఉంచుకోండి.

ఈ మధ్య కాలంలో చాలామంది ప్రహరీ గోడకు కూడా పునాది తీస్తూ పిల్లరు వేస్తూ ప్రహరీ నిర్మిస్తున్నారు. వారికోసం పునాది తీయడం :- ఈశాన్య భాగం నుండి మొదలు పెట్టి తరువాత ఉత్తరము నందు ఒక పునాది తీయాలి. తరువాత తూర్పు నందు ఒక పునాది తీయాలి. తరువాత వాయవ్యం నందు, తరువాత ఆగ్నేయం నందు. తరువాత దక్షిణము నందు, తరువాత పశ్చిమము నందు చివరిగా నైఋతి నందు పునాది తీసుకోవాలి. మరొకసారి చెబుతున్నాను, గృహము బయట వున్న దోషాలను ఈ ప్రహరీగోడ చాలా భాగము ఆపుతుంది ఈ విషయంలో దయచేసి నిర్లక్ష్యం చేయరాదని నా మనవి.




పైన చూపించిన విధంగా మీ స్థలమునందు ప్రహరీగోడ కొరకు పునాదులను త్రవ్వించుకోవలెను. ఈ రకంగా పునాదులు తీసుకున్నప్పుడు వాస్తు పరంగా స్థలమునకు బలము పెరిగి గృహ నిర్మాణం త్వరగా అవ్వడానికి దోహదం చేస్తుంది. తరువాత కార్యక్రమము అయిన పిల్లరు త్వరగా వేసుకోవడానికి వాస్తుబలము సహకరిస్తుంది. పిల్లరు వేయడం నైఋతి భాగం నుండి మొదలు పెట్టి తరువాత దక్షిణ భాగం పిల్లరు వేయండి. తరువాత పశ్చిమ భాగం పిల్లరు వేయండి. తరువాత వాయువ్య భాగం, ఆగ్నేయ భాగం తరువాత ఉత్తర భాగం, తరువాత తూర్పు భాగం నందు చివరిగా ఈశాన్య భాగం నందు పిల్లరు వేసుకోవాలి. ఆ తరువాత నైఋతి భాగం నుండి దక్షిణం వైపుగా మరియు నైఋతి భాగము నుండి పశ్చిమ వైపుగా ప్రహరీ గోడను నిర్మిస్తూ మరియు ఆగ్నేయము నుండి ఈశాన్యము దిక్కుగా చివరిగా వాయవ్యము నుండి ఈశాన్యము వరకు ప్రహరీ గోడను నిర్మించుకోవాలి. అయితే ప్రహరీ గేటు ఎక్కడ వస్తుందో ముందుగానే చూసుకోండి. తూర్పు అయితే తూర్పు ఈశాన్య మొత్తం, దక్షిణమైతే

దక్షిణ ఆగ్నేయం మొత్తం, ఉత్తరమైతే ఉత్తర ఈశాన్యం మొత్తము, పడమర అయితే పశ్చిమ వాయువ్యము మొత్తము ఖాళీగా ఉంచుకోవలెను.

తూర్పు వీధి స్థలము అయితే నైరుతి భాగము నుండి ప్రహరీ గోడ నిర్మాణమును మొదలు పెట్టి పశ్చిమము దక్షిణము, ఉత్తర భాగములందు పూర్తి గావించి చివరిగా తూర్పు భాగము యందు ఆగ్నేయము నుండి తూర్పు మధ్యము వరకు ప్రహరీ గోడ నిర్మాణం గావించి, తూర్పు మధ్యము నుండి ఈశాన్య భాగము వరకు ఖాళీ వదులుకోవలెను. ప్రహరీ గోడ లోపల గృహ నిర్మాణము అయిన పిదప తూర్పు ఈశాన్య భాగము నందు గేటును ఉంచగా మిగిలిన ప్రాంతంలో ప్రహరీని పూరించుకోవాలి.

దక్షిణ వీధి స్థలము అయితే నైఋతి భాగము నుండి ప్రహరీ గోడ నిర్మాణమును మొదలు పెట్టి వరుసగా పశ్చిమము, దక్షిణ మధ్యమము వరకు, తరువాత వాయువ్యము నుండి ఈశాన్యము వరకు, తరువాత ఆగ్నేయము నుండి ఈశాన్యము వరకు ప్రహరీ గోడను నిర్మించుకోవాలి. దక్షిణ మధ్యము నుండి ఆగ్నేయము వరకు ఖాళీ స్థలము వదులుకోవాలి. గృహము పూర్తి అయిన తరువాత దక్షిణ ఆగ్నేయము నందు గేటును ఉంచుకోగా మిగిలిన ప్రాంతములో ప్రహరీ గోడను పూరించుకోవాలి.

పడమర వీధి స్థలము అయితే నైఋతి భాగము నుండి పడమర మధ్య వరకు ప్రహరీ గోడను నిర్మించుకోవాలి. దక్షిణము, తూర్పు, ఉత్తర భాగముల ప్రహరీ గోడలను కట్టుకోండి. పశ్చిమ వాయువ్యము మాత్రము ఖాళీగా ఉంచుకొని ప్రహరీలోని గృహమంతయూ నిర్మించిన తరువాత పశ్చిమవాయువ్య భాగమునందు గేటును ఉంచుకోగా మిగిలిన ప్రహరీని కూడా కట్టుకోవలెను.

ఉత్తర వీధి స్థలము అయితే నైఋతి భాగము నుండి పడమర, దక్షిణ, తూర్పు భాగములు మరియు వాయువ్యము నుండి ఉత్తరము మధ్యమువరకు ప్రహరీ గోడ నిర్మాణము గావించి, ఉత్తర మధ్యము నుండి ఈశాన్యము వరకు ఖాళీ స్థలమును ఉంచుకోవాలి. ప్రహరీలోని గృహమంతయూ నిర్మించిన తరువాత ఉత్తర ఈశాన్య భాగమునందు గేటును ఉంచుకోగా మిగిలిన ప్రహరీని కూడా పూర్తి చేయవలెను.

**ప్రహరీగోడ హెచ్చు తగ్గులు :-** ప్రహరీ గోడకు చక్కటి వాస్తు బలము కలగాలంటే వైనంగా ప్రహరీ గోడను నిర్మించుకోవలసి ఉంటుంది. నైఋతి భాగములో చాలా బలముగా, లావుగా, మందముగా, ఎత్తుగా నిర్మించి, పశ్చిమము మరియు దక్షిణమునకు పోనుపోను ఇదే పద్ధతిలో నిర్మించుకొని వాయువ్యము మరియు ఆగ్నేయము వరకుగా సాగాలి. ఆ తరువాత ఆగ్నేయము నుండి ఈశాన్యమునకు, వాయువ్యమునుండి ఈశాన్యము వరకు గల తూర్పు, ఉత్తర ప్రహరీ గోడలను పలుచగా తక్కువ ఎత్తులో నిర్మించుకోవాలి. ఏ వీధి అయితే ఆ వీధి యందలి ప్రహరీ గోడ ఉచ్ఛ స్థానమున గేట్ల కొరకు ఖాళీ స్థలమును వదులుకొని మిగిలిన ప్రాంతములన్నిటా ప్రహరీని నిర్మించుకోవాలి.

**హెచ్చు తగ్గులు :-** పశ్చిమము మరియు దక్షిణ ప్రహరీ 5 అడుగులు ఎత్తు తగ్గకుండా 10 అడుగుల వరకు మీ అనుకూలమును బట్టి కట్టుకోవచ్చును. స్థలము ఎక్కువగా ఉన్నచో ప్రహరీగోడ కూడా పెద్దగా వచ్చును. పునాది తీసి ప్రహరీగోడ వచ్చు ప్రాంతమంతయూ లావుపాటి బండరాళ్ళను పరుచుకొని దానిపై బీమ్ వేసి పిల్లర్ సిస్టమ్ ద్వారా ప్రహరీ నిర్మించుకోవడం మంచిది. తూర్పు మరియు ఉత్తరము నాలుగడుగులు తగ్గకుండా 9 అడుగుల వరకు మీ అనుకూలమును బట్టి కట్టుకోవచ్చును. కానీ తూర్పు, ఉత్తరముల ప్రహరీ గోడ పశ్చిమము మరియు దక్షిణముల ప్రహరీగోడ కన్నా ఎత్తు ఉండరాదు.

**ప్రహారీగేట్లు :-** ప్రహారీ అంతయూ నిర్మించుకోవడం ఒక ఎత్తు, ప్రహారీ గేట్లు బిగించుకోవడం ఒక ఎత్తు ఏ పొరపాటు లేకుండా ప్రహారీ గేటును బిగించుకోవలసి ఉంటుంది. ప్రహారీ గేటును చెక్కతోను, కంచెగాని, దడి కట్టుకొని గాని, ఇనుప గ్రిల్స్‌తోను, ఇనుప తలుపులుగాను ఈ మధ్యలో కొత్తగా ప్లాస్టిక్‌లోను ధృఢమైన గేట్లు వస్తున్నాయి. ప్రహారీ గేట్లను తూర్పు వీధి గృహమునకైతే తూర్పు ఈశాన్యమునందును, దక్షిణ వీధి గృహమునకైతే దక్షిణ ఆగ్నేయమునందు, పశ్చిమ వీధి గృహము అయితే పశ్చిమ వాయువ్యమందును, ఉత్తరవీధి గృహమైతే ఉత్తర ఈశాన్యము భాగము నందు ప్రహారీ గేట్లను నిర్మించుకోవలసి ఉంటుంది. పై విధంగా నిర్మించుకున్నప్పుడే నడక ఉచ్ఛమై శుభకరమైన ఫలితాలు వస్తాయి. గృహమునకు ద్వారములు ఎంత ముఖ్యమో, ప్రహారీకి గేట్లు అంత ముఖ్యము.

తూర్పు వీధి గృహమునకు ప్రహారీగోడ లోపల వున్న స్థలములో గృహమును నైఋతికి కట్టి ఉంటాము. కావున గృహ ప్రధాన ద్వారమునకు ఎదురుగా ప్రహారీకి గేటు ఉంచుకుంటారు. అయితే చాలామంది ఈ ఒక్కగేటు చాలని ప్రహారీకి ఈశాన్యములో ఇంకొక గేటు నిర్మించుకోరు. ఒకవేళ నిర్మించుకున్ననూ ఆ గేటు గుండా నడక సాగించక తలుపులు బిగించి, తాళము వేసి, గృహము ముఖద్వారము నకు ఎదురుగా ఉన్న ప్రహారీ గేటు గుండానే ఎక్కువగా నడక సాగిస్తుంటారు. ఈ విధంగా చేయడం వలన ఈశాన్య నడకను కోల్పోవుదురు. తప్పని సరిగా ఈశాన్యము నడక వచ్చి తీరాలి. ఈశాన్యం నడక రానిచో ఈశాన్య శుభఫలము గృహస్థులకు అందడం కష్టం. తూర్పు మరియు ఉత్తర వీధి గల గృహములకు రెండు గేట్లు రావడం చాలా మంచిది. ఒకవేళ ఈశాన్యభాగములో ఒక గేటు వచ్చి, గృహ ముఖ ద్వారమునకు ఎదురుగా గల ప్రహారీగేటు రాకపోయిననూ పరవాలేదు. గృహ ముఖద్వారమునకు ఎదురుగా ఉన్న గేటు ఈశాన్యభాగమునకు ఉన్నచో ఏ తొందరా లేదు. అలాగాక ఆగ్నేయము దిక్కుగా ఉన్నచో ఆ గేటును తీసివేయడం మంచిది. దక్షిణ మరియు పశ్చిమ ప్రహారీ గోడలకు ఉచ్ఛములో గేటు ఉంటూ ఇంటి ముఖద్వారమునకు ఎదురుగా ప్రహారీకి గేటు ఉండి తీరాలి. ఎందుకనగా దక్షిణ వీధి గల గృహమునకు ఉచ్ఛములో మాత్రమే గేటు ఉంది అనుకోండి అప్పుడు ఆ గేటు ద్వారా గృహమునకు రావాలంటే కాస్త వాయువ్య నడక వస్తుంది. ఆగ్నేయ వాయువ్య నడకలు తప్పు కదా.

ఒకవేళ దక్షిణము మరియు పశ్చిమ గృహములకు ప్రహారీ ఎంత ఉందో దాదాపుగా అంత లోపుగా గృహము కూడా ఉన్నచో గృహము ముఖ ద్వారము ఉచ్ఛమైనచో ప్రహారీకి ఈ ఉచ్ఛమైన గేటు ఎదురుగా ఇంకొక గేటు ఉంచినచో చాలును. రెండవ గేటు అవసరము లేదు. ఒకవేళ ప్రహారీకి రెండవ గేటు ఉచ్ఛంలో పెట్టుకున్ననూ తప్పులేదు.

**ప్రహారీ గోడ మరియు గేటు నిర్మాణములో కొన్ని ముఖ్యమైన విషయాలు :**

1. తూర్పు ముఖద్వారమునకన్నా (సింహద్వారముకన్నా) తూర్పు ప్రహారీగోడ ఎత్తుగా ఉండరాదు. 2. ఉత్తర ముఖద్వారమునకన్నా ఉత్తర ప్రహారీగోడ ఎత్తుగా ఉండరాదు. 3. దక్షిణ ముఖద్వారముకన్నా దక్షిణ ప్రహారీగోడ సమంగా గానీ, ఎత్తుగా గానీ రావచ్చును. 4. పశ్చిమ ముఖద్వారముకన్నా పశ్చిమ ప్రహారీగోడ సమంగా గానీ, ఎత్తుగా గానీ రావచ్చును. 5. వానలకు, ప్రకృతి విలయాలకు ఇతరత్రా కారణాల వల్ల ప్రహారీగోడ కూలినచో వెంటనే సరిచేయించుకోవాలి. ఒకవేళ నైఋతి భాగము పడిపోయినచో అన్ని పనులనూ పక్కన పెట్టి యుద్ధ ప్రాతిపదికన నైఋతి గోడను పునర్నించుకోవాలి. ఇదే పద్ధతి దక్షిణ, పశ్చిమ, తూర్పు ఆగ్నేయ, ఉత్తర వాయువ్య ప్రహారీ మూలలకు వర్తించును. 6. ప్రహారీగేటు నిర్మించుకున్నప్పుడు దీని పిల్లరు లేదా అంచు లేదా

కోణం లేదా మొత్త లేదా దిమ్మె ఇంటి ముఖద్వారమునకు తగులరాదు. ఇది ఏ ముఖద్వారము గృహమునకైనను వర్తిస్తుంది. 7. తూర్పు మరియు ఉత్తర గృహములకు ప్రహారీలు కట్టినప్పుడు ఎవరైననూ ఈశాన్యము పెంచుకుంటారు. కొందరి గృహములకు ఎక్కువ ఈశాన్యం వచ్చి ఉంటుంది. అప్పుడు ప్రహారీ గోడ ఈశాన్యము దిక్కుగా బాగా జరిగి ఉంటుంది. దీని వల్ల మొత్తం ప్రహారీకి ఈశాన్యము పెరుగుతుంది.

ఇక్కడ ఒక మతలబును గమనించండి. దీనికి గేటును ఉంచు సమయంలో తగిన జాగ్రత్తలు తీసుకోవాలి. లేకపోతే అసలుకే మోసం వస్తుంది. తూర్పు ఈశాన్యం పెరిగి ప్రహారీ నిర్మించినప్పుడు ప్రహారీతో పాటుగా గేటును పెట్టడము వల్ల గేటు ఆగ్నేయమును చూస్తుంది. కావున గేటు యొక్క ఈశాన్య భాగమును వెనుకకు జరిపి గేటు తూర్పును చూస్తున్నట్లుగా బిగించుకోవాలి. ఇదే విధానమే ఉత్తర ఈశాన్యం పెరిగిన గృహములకు కూడా పాటించాలి.

**పెద్ద గేటులో చిన్న గేటు ఏర్పాటు :-** గృహమునకు సాధారణముగా ఏ గేటునైనా ఉచ్ఛములో ఉంచుకుంటాము. రెండు గేట్లు ఎందుకని కొందరు ఉచ్ఛములో మాత్రము పెద్ద గేటును నిర్మించు కుంటారు. దీని వల్ల మనుషులు ఒక్కటే లోనికి వచ్చినప్పుడు అంతపెద్ద గేటును తెరుచుకొని లోనికి రావడం ఇబ్బందిగా అనిపిస్తుంది. దీనికి గాను పెద్ద గేటులోనే ఒక చిన్న గేటును ఏర్పాటు చేసుకున్నచో చిన్న గేటు ద్వారా మనుషులు, పెద్ద గేటు ద్వారా వాహనములు లోనకు రావచ్చును. ఈ చిన్న గేటు ఏర్పాటు కూడా వాస్తుశాస్త్ర రీత్యా నిర్మించుకోవడం మంచిది. తూర్పు గృహమునకు ఈశాన్యములో ఉన్న పెద్ద గేటుయందు చిన్న గేటు నిర్మాణ మును పెద్దగేటులో ఉత్తర భాగమునకు ఏర్పాటు చేసుకోవలెను. తద్వారా మన నడక ఈశాన్యం నడకై ఉత్తమ ఫలితములను ఇవ్వగలదు. అట్లు కాదని పెద్ద గేటులో దక్షిణ దిక్కు భాగమునకు ఏర్పాటు చేసుకున్నచో ఈశాన్య భాగ నడకను కొంతయినా మనము పోగొట్టుకున్నట్లే. అయితే ఏ ప్రమాదం లేదు.

**దక్షిణ భాగము :-** ఈ భాగముయందు పెద్దగేటును దక్షిణ ఆగ్నేయములో నిర్మించుకొని ఉంటారు. అయితే దక్షిణగృహం ముఖద్వారమునకు ఎదురుగా ప్రహారీకి ఒక గేటును ఉంచుకోవాలి. పెద్ద గేటు దక్షిణ ఆగ్నేయము నందు ఉంటుంది కదా. చిన్న గేటును పెద్ద గేటులో తూర్పు వైపునకు అమర్చుకోవలెను. తద్వారా ఉచ్ఛమైన దక్షిణ ఆగ్నేయ నడక వస్తుంది. ఇప్పుడు మొత్తము 3 గేట్లు అని అనుకోరాదు.

**పశ్చిమ భాగము :-** ఈ భాగమునందు పెద్దగేటును పశ్చిమ వాయువ్య భాగములో నిర్మించుకొని ఉంటారు. పెద్ద గేటుయందు చిన్న గేటును ఉత్తర భాగము ప్రక్కగా ఏర్పాటు చేసుకోవలెను.

**ఉత్తర భాగము :-** ఈ భాగము నందు పెద్ద గేటును ఉత్తర ఈశాన్యము నందు నిర్మించుకుంటారు. ఈ పెద్దగేటులో చిన్న గేటును తూర్పు భాగము వైపుగా ఏర్పాటు చేసుకోవాలి. తద్వారా మహోన్నతమైన ఉత్తర ఈశాన్య నడక వస్తుంది.

**ప్రహారీగోడ శుభాశుభ ఫలితములు :-** 1. తూర్పు వీధి గృహమునకు ప్రహారీగోడ వాస్తు శాస్త్రరీత్యా నిర్మించుకున్నచో భద్రత లభించును. ఆరోగ్యము బాగుండి, సంఘము నందు మంచి పరపతి పెరిగి, సమాజములో గుర్తింపు లభించును. తూర్పువీధి గృహమునకు ప్రహారీ గోడ వాస్తుశాస్త్ర రీత్యా నిర్మించు కోకుండా ఉన్నట్లయితే పై చెప్పుకున్న వాటికి వ్యతిరేకము జరిగే అవకాశం. పైగా పరిసర వాస్తు యొక్క దుష్ప్రభావము ఎక్కువ. 2. దక్షిణ వీధి ప్రహారీగోడ వాస్తుశాస్త్ర రీత్యా నిర్మించుకున్నచో ఆరోగ్యము బాగుండి, ఆడవారు సుఖపడి, ధనము వృద్ధి అగును. భద్రత లభించును. దక్షిణవీధి ప్రహారీగోడ వాస్తుశాస్త్ర రీత్యా లేకపోతే అభద్రతా భావము, అనారోగ్యాలు, ధననష్టము, మగవారికి ఉంపుడుగత్తెలపై మోజు, పైగా దుష్ప్రభావము గల పరిసరవాస్తు, పూర్తి ప్రభావమును

గృహముపై చూపిం చును. 3. పశ్చిమ వీధి ప్రహారీగోడ వాస్తుశాస్త్ర రీత్యా నిర్మించుకున్నచో విజయము, భద్రతాభావము, సంఘమున గౌరవము, ప్రతిష్ఠ, ఉన్నతాసనము, వాహన యోగము, మాట, పలుకుబడి పెరుగుట, పనివారు సరిగా విధులను నిర్వర్తిం చుట, ఇతరత్రా. ఇదే పశ్చిమవీధి ప్రహారీగోడ వాస్తుశాస్త్రరీత్యా లేకపోతే పై చెప్పుకున్న శుభ పరిణామములకు వ్యతిరేకము జరిగి, కొట్లాటలు, వ్యవహారములలో దెబ్బతినుట, అనారోగ్యాలు, ఘోరమైన రోగాలు, పైగా దుష్ప్రభావము గల పరిసరవాస్తు, పూర్తి ప్రభావమును గృహముపై చూపించును. 4. ఉత్తరవీధి ప్రహారీగోడ వాస్తుశాస్త్రరీత్యా నిర్మించుకున్నచో ధనవృద్ధి, ఆనందము, సౌఖ్యము, భాగ్యము, భోగము, ఆకర్షణ, భద్రత ఇతరత్రా సత్ఫలితములు లభిస్తాయి. ఇదే ఉత్తరవీధి ప్రహారీగోడ వాస్తుశాస్త్రరీత్యా లేకపోతే పై చెప్పుకున్న వాటికి వ్యతిరేకము జరుగుతూ అప్పులు, ఈతి బాధలు, చెప్పుకోలేని సమస్యలు ఇతరత్రా పైగా దుష్ప్రభావము గల పరిసరవాస్తు, పూర్తి ప్రభావమును గృహముపై చూపించును.

**ప్రహారీగేట్ల శుభాశుభఫలితములు :-** 1. తూర్పు వీధి గృహ ప్రహారీగోడకు గేటును వాస్తురీత్యా తూర్పు ఈశాన్య భాగంలో తూర్పును చూస్తున్నట్లుగానూ లేదా ఈశాన్యమును చూస్తున్నట్లు గానూ ఏర్పాటు చేసుకున్నచో అనేక విధములైన శుభఫలితములు తక్కువ సమయములో దరి చేరును. అట్లు కాకుండా గేటు ఆగ్నేయము చూస్తున్నట్లుగా ఉన్నచో చోరుల బాధ, అగ్ని ప్రమాదములు, ఆక్సిడెంట్లు ఇతరత్రా. 2. దక్షిణవీధి గృహ ప్రహారీగోడకు గేటును వాస్తురీత్యా దక్షిణముకు చూస్తున్నట్లుగా ఏర్పాటు చేసుకున్నట్లయితే ధనవృద్ధి, ఆరోగ్యము బాగుండడం, భద్రతా భావము, ఇతరత్రా. ఇదే గేటును నైఋతి చూస్తున్నట్లుగా ఉంచుకున్నట్లయితే అభద్రతా భావము, మరణాలు, వ్యవహారములు ఇతరత్రా. 3. పశ్చిమ వీధి గృహ ప్రహారీగోడకు గేటును వాస్తురీత్యా పశ్చిమమునకు చూస్తున్నట్లుగా ఏర్పాటు చేసుకున్నట్లయితే వ్యవహార విజయము, ఆరోగ్యము, భద్రతా భావము, మనశ్శాంతి ఇతరత్రా. ఇదే గేటును నైఋతి చూస్తున్నట్లుగా ఉంచుకున్నట్లయితే అభద్రతా భావము, భయం భయంగా ఉండడం, మరణాలు, వ్యవహార అపజయములు, బిత్తు బిత్తుగా ఉండడం, నోటమాట సరిగా రాకుండా పోవడం, శత్రుత్వాలు ఇతరత్రా. 4. ఉత్తర వీధి గృహ ప్రహారీగోడకు గేటును వాస్తురీత్యా ఉత్తరమునకు లేదా ఈశాన్యమునకు చూస్తున్నట్లుగా ఏర్పాటు చేసుకున్నట్లయితే ధనవృద్ధి, సుఖ సంతోషాలు, ఆనందము, భోగభాగ్యాలు, హుషారుగా ఉండడం, ఇతరత్రా. అయితే ఇదే గేటును వాయువ్యమునకు చూస్తూన్నట్లుగా నిర్మించుకున్నట్లయితే అప్పులబాధలు, వ్యవహారములు, కోర్టు వ్యాజ్యాలు, ఆడవారి ఏడుపులు, ఇతరత్రా.

స్వంత వైద్యం ఏనాటికి పనికి రాదనే విషయం తెలుసుకోవాలి. ఏదో వాస్తులో నాలుగు విషయాలు తెలిసాయి కదా అని మన గృహంపై మనమే పరిశోధన చేస్తే మనము మత్రమే బాధ పడవలసి వస్తుంది. ఒక అనుభవజ్ఞుడైన వాస్తు శాస్త్రవేత్తచే గృహాన్ని పరిశీలింప చేయిస్తే చాలా మంచిది. మంచి ఫలితాలు లభిస్తాయి.

## వాస్తు సలహాలు

సూక్ష్మంగా, విఫలంగా గల ఈ వాస్తు సలహాలను చదివి అవగాహన చేసుకోగలరని భావిస్తాను. ముందుగా స్థలము కొనే వారి కోసము సలహాలు.

1. మొట్ట మొదటి సూచనగా మీరు కొనబోయే గృహమునకు ఈశాన్యము త్రెంపు లేకుండా చూసుకోవాలి.
2. గృహమునకు ఈశాన్య భాగంలో మెట్లు, దిబ్బలు, భారీ భవంతులు, సెల్ ఫోన్ టవర్లు తదితరములు లేకుండా చూసుకోండి. ఈశాన్యములో తొలగించుకోవడానికి వీలైన మెట్లు దిబ్బలు తదితరములను తొలగించుకొని మాత్రమే గృహమును కొనడానికి ప్రయత్నము చేయాలి. ఒకవేళ వీలు లేకపోతే గృహము కొన్న తక్షణము వాటిని తొలగించుకోవాలి.తొలగించుకోవడానికి వీలులేని నిర్మాణములు వున్నచో ఆ గృహమును మీరు కొనకపోవడమే మంచిది.
3. మీరు కొనబోయే గృహమునకు తూర్పు భాగము త్రెంపు కలిగి వుండరాదు. అలాగే తూర్పు భాగంలో ఎత్తులు గాని, భారీ భవంతులు గాని ఇతరత్ర ఇబ్బందులు కలిగించే ఆవాస్తు నిర్మాణములు వున్నచో ఆ గృహమును కొనవద్దు.
4. మీరు కొనబోయే గృహమునకు  ఆగ్నేయ భాగం త్రెంపు కలిగివున్నచో ఏ ప్రమాదము లేదని గమనించాలి. కొన్నిసార్లు ఆగ్నేయ భాగం త్రెంపు గృహాలు అందువుండు యజమానులను మంచి అభివృద్ధికి తీసుకు వెల్లడము జరుగుతుంది.
5. కొనబోయే గృహమునకు దక్షిణ భాగము వుచ్ఛంగా, బాగా ఎత్తుగా, మిత్రు కలిగి వున్నప్పుడు చాలా మంచిది.
6. దక్షిణ భాగము పల్లము కలిగి, గుంతలు, కొలనులు, పెద్ద కాలువలు వున్నచో అటువంటి గృహములను కొనరాదు.
7. కొనబోయే గృహమునకు నైఋతి పెరిగి వున్నచో అటువంటి గృహములను వదులుకోవడం మంచిది. పెరిగిన నైఋతి  భాగమును తొలగించికోవడానికి వీలై అనుకూలమైనచో ఆ గృహమును కొనవచ్చును. హెచ్చరికగా వుండాలి.
8. నైఋతి భాగంలో ఎటువంటి పరిస్థితులలోను గుంతలు, కొలనులు, పెద్ద కాలువలు, బావులు ఇతరత్ర దోషపూరితమైనవి ఉన్నప్పుడు అటువంటి గృహములను కొనరాదు. ఈ విషయంలో జాగ్రత్త అవసరము. పొరపాటు చేయరాదు.
9. నైఋతి భాగంలో కొండలు, గుట్టలు, భారీ భవంతులు, అపార్లమెంట్లు, సెల్‌ఫోన్ టవర్లు ఇతరత్ర వున్నచో అటువంటి గృహములను నిరభ్యంతరముగా కొనగోలు చేయవచ్చు. చాలా మంచిది. ఈ అవకాశం వదులుకోవద్దు.
10. కొనబోయే గృహమునకు పశ్చిమ భాగం పల్లమైనచో ఆ గృహమును కొనరాదు. కిరాయికి వుండడము మంచిది కాదు.
11. పశ్చిమ భాగం మిత్రు కలిగి వున్న గృహములను కొనవచ్చు. ఆరోగ్యము, ఐశ్వర్యము, పెద్దరికము లభించును.
12. కొనబోయే గృహమునకు వాయవ్య భాగములో పల్లముగాని, గుంతలు బావులు గాని, లేకుండా చూసుకోవాలి. నైఋతి, ఆగ్నేయం కన్నా వాయువ్య భాగం మిత్రుగా వుండరాదు. ఈశాన్యం భాగం కన్నా మిత్రుగా వుండాలి.

13. కొనబోయే గృహమునకు ఉత్తర భాగంలో బావులు, గుంతలు, పెద్ద కాలువలు, ఇతరత్ర వున్నచో గృహమును కొనవచ్చు.
14. కొనబోయే గృహమునకు ఉత్తర భాగంలో మెట్లు కాని, భారీ భవంతులు గాని, గుట్టలు గాని, ఇతరత్ర వున్నచో అటువంటి గృహములను కొనకపోవడము చాలా మంచిది. లేనిచో అష్ట దరిద్ర్యము, నిత్యమూ తలపోట్లే.
15. వీధి పోట్లు విషయంలో చాలా జాగ్రత్తలు తీసుకోవాలి. ముఖ్యంగా ఒక విషయము గమనించుకోవాలి. ఈశాన్య వీధిపోటు వున్న గృహములను ఎటువంటి పరిస్థితులలోను వదులుకోరాదు. ఇటువంటి గృహములను కొనే అవకాశము వచ్చినపుడు తప్పని సరిగా కొనడము చాలా మంచిది.
16. తూర్పు వీధి పోటు గల గృహము నిరభ్యంతరముగా కొనవచ్చు.
17. తూర్పు ఆగ్నేయం వీధి పోటు గల గృహము కొనరాదు.
18. ఆగ్నేయ వీధి పోటు గల గృహమును కొనరాదు.
19. దక్షిణ ఆగ్నేయ వీధి పోటు గల గృహమును అశుభమని తలచరాదు. నిరభ్యంతరముగా కొనవచ్చు.
20. దక్షిణ వీధి పోటు గల గృహమును కొనవచ్చు.
21. దక్షిణ నైఋతి వీధి పోటు గల గృహమును కొనరాదు.
22. నైఋతి వీధి పోటు గల గృహమును ఎటువంటి పరిస్థితిలోను కొనరాదు.
23. పశ్చిమ నైఋతి వీధి పోటు గల గృహమును కొనరాదు.
24. పశ్చిమ వీధి పోటు గల గృహమును కొనవచ్చు. (పూర్తి వివరాలకు శుభవాస్తు పుస్తకమును చదవండి.)
25. పశ్చిమ వాయవ్య వీధి పోటు గల గృహమును నిరభ్యంతరముగా కొనవచ్చు.
26. వాయవ్య వీధి పోటు గల గృహమును కొనరాదు.
27. ఉత్తర వాయవ్య వీధి పోటు గల గృహమును కొనరాదు.
28. ఉత్తర వీధి పోటు గల గృహమును కొనవచ్చు.
29. ఉత్తర ఈశాన్య వీధి పోటు గల గృహమును నిరభ్యంతరముగా కొనవచ్చు.
30. ఎత్తు పల్లాల విషయానికి వస్తే ఈశాన్య భాగంలో పల్లమున్న గృహమును నిరభ్యంతరముగా కొనవచ్చు.
31. ఈశాన్య భాగంలో ఎత్తు గల గృహమును కొనరాదు.
32. తూర్పు భాగమున పల్లమున్న గృహమును కొనవచ్చు.
33. తూర్పు భాగమున హెచ్చు, ఎత్తు కలగి వున్న (మిద్దె) గృహమును కొనరాదు.
34. ఆగ్నేయ భాగంలో పల్లమున్న గృహమును కొనరాదు.
35. ఆగ్నేయ భాగంలో నైఋతి కన్నా ఎత్తు కలిగి వున్న గృహమును కొనరాదు.
36. దక్షిణ భాగమున ఎత్తు కలిగి వున్న గృహమును కొనడము మంచిది.
37. దక్షిణ భాగమున పల్లము కలిగి వున్న గృహమును కొనరాదు.
38. నైఋతి భాగమున ఎత్తు కలిగి వున్న గృహమును కొనవచ్చు.
39. నైఋతి భాగమున పల్లము కలిగి వున్న గృహమును కొనరాదు.
40. పశ్చిమ భాగమున ఎత్తు కలిగి వున్న గృహమును కొనవచ్చు.
41. పశ్చిమ భాగమున పల్లము కలిగి వున్న గృహమును కొనరాదు.

42. వాయవ్య భాగమున ఆగ్నేయం, నైఋతి కన్నా ఎత్తు కలిగి వున్న గృహమును కొనరాదు.

43. వాయవ్య భాగమున పల్లము కలిగి వున్న గృహమును కొనరాదు.

44. ఉత్తర భాగమున ఎత్తు కలిగి వున్న గృహమును కొనరాదు.

45. ఉత్తర భాగమున పల్లము కలిగి వున్న గృహమును కొనవచ్చు.

46. కొనబోయే గృహము గురించి అందు నివసించిన వారి గురించి, వారి పరిస్థితుల గురించి చుట్టు పక్కల వారిని అడిగి విచారించడం చాలా మంచిది. దీని వల్ల కనీసం మీరు కొనబోయే గృహము పరిస్థితి అర్థము అవుతుంది. కొనబోయే గృహమునకు ఎటువంటి కోర్టు వాజ్యములు లేకుండా ఇతర వ్యవహారములు లేకుండా వున్నటువంటివి మాత్రమే కొనాలి. సాధారణంగా వాయవ్య, ఆగ్నేయ దోషాలు కలిగిన గృహాలకు కోర్టు వ్యవహారాలు ఉండును. గృహము కొనే సమయంలో మీరు కొనేలా వారిలా వుండక సాధారణ వ్యక్తిలా వెళ్లి విచారించడం చాలా మంచిది. వ్యవహారములన్న గృహములను ఇతరులకు అంటగట్టడానికి ఎన్నో ప్రయత్నాలు చేస్తుంటారు. జాగ్రత్తలు తీసుకోవాలి. సాధారణంగా కొనబోయే గృహమునకు వాయవ్య, ఆగ్నేయ దోషమున్నచో వ్యవహారములు వుంటాయని గమనించాలి. కొనబోయే స్థలమునకు కూడా పై పాయింట్స్‌ను గమనించి దోషములు లేకుండా వున్న స్థలమును కొనడము మంచిది. ముఖ్యముగా గృహముల కన్నా స్థలముల విషయములో ఎన్నో వ్యవహారములు వుంటాయి. ఇటువంటి అన్నింటిని గమనించి తగిన జాగ్రత్తలు తీసుకొని కొనడము చాలా మంచిది. ఏది ఏమయినా చుట్టు ప్రక్కల వారిని విచారించడము మంచిదనే విషయము మరొకసారి గుర్తుకు తెచ్చుకోవాలి. ఒక్కో సారి స్థలముల విషయములో చుట్టు ప్రక్కల ఎవరిని విచారించడానికి అవకాశము వుండదు. కావున అనుభవజ్ఞుడైన ఓ న్యాయవాదిని సంప్రదించి జాగ్రత్తలు పాటించి స్థలములను కొనాలి.

47. స్థలముల విషయములో దక్షిణ నైఋతి, పశ్చిమ భాగంలో బావులు, గుంతలు, పల్లము లేకుండా చూసుకోవాలి.

48. ఉత్తర, ఈశాన్య, తూర్పు భాగమున బావులు, గుంతలు, పెద్ద కాలువలు, పల్లమున్న స్థలములను వదులుకోవద్దు.

49. ఇక వీధి పోట్ల విషయములో చెడు వీధి పోట్లు గల స్థలములను కొనరాదు.

50. శుభ వీధి పోట్లు గల స్థలములను కొనడము మంచిది.

51. ఈశాన్య వీధి పోటు గల స్థలములను ఎటువంటి పరిస్థితులలోను వదులు కోవద్దు. ఇలాంటి స్థలాలు కొనండి.

52. పెరిగిన స్థలముల విషయమునకు వస్తే ఈశాన్యం పెరిగిన స్థలమును వెంటనే కొనండి.

53. తూర్పు పెరగడము మంచిది. కాని ఈశాన్యం కోల్పోతుంది కదా. కావున ఇటువంటి స్థలముల విషయములో పూర్తి జాగ్రత్తలు తీసుకోవాలి. అనుభవజ్ఞుడైన ఓ వాస్తు శాస్త్రవేత్త సలహాలను పొందడం చాలా మంచిది గమనించండి.

54. ఆగ్నేయం పెరిగిన స్థలమును ఎటువంటి పరిస్థితులలోను కొనరాదు. దక్షిణ ఆగ్నేయం పెరిగిన స్థలమును కొనవచ్చు. అయితే ఈశాన్యములో గుంత వుండడం చాలా మంచిది. ఉత్తర ఈశాన్య నడక రావడము మరీ మంచిదని తెలుసుకోవాలి.

55. దక్షిణ భాగము పెరిగిన స్థలమును కొనరాదు.

56. దక్షిణ నైఋతి పెరిగిన స్థలమును కొనరాదు.

57. నైఋతి పెరిగిన స్థలమును ఎటువంటి పరిస్థితులలోనూ కొనరాదు.

58. పశ్చిమ నైఋతి పెరిగిన స్థలమును కొనరాదు.

59. పశ్చిమము పెరిగిన స్థలమును కొనరాదు.

60. పశ్చిమ వాయవ్యం పెరిగిన స్థలమును కొనవచ్చు.

61. వాయవ్యం పెరిగిన స్థలమును కొనరాదు.

62. ఉత్తరం పెరగడం చాలా మంచిది. అలాగని ఉత్తరం పెరిగిన స్థలమును కొన్నచో ఈశాన్య భాగమును కోల్పోతాము గదా. కావున ఇటువంటి స్థలముల విషయములో తగిన జాగ్రత్తలు తీసుకోవాలి. అనుభవజ్ఞుల సలహాలు పొందాలి.

63. ఉత్తర ఈశాన్యం పెరిగిన స్థలమును నిరభ్యంతరముగా కొనవచ్చు. ఇటువంటి స్థలాలను ఎటువంటి పరిస్థితుల్లోనూ వదులుకోవద్దు. కాస్త ధర ఎక్కువ అయిననూ స్థలమును కొనండి. తరాల కొద్దీ ఐశ్వర్యాన్ని నింపుకోండి.

**ఇప్పటి వరకు మీరు కొనబోయే గృహములు మరియు స్థలముల గురించి తెలుసుకోవడం జరిగినది. ఇకపై కొన్ని గృహములకు మరియు మీరు నివాసితమున్న గృహమునకు వాస్తు దోషమున్నచో వాటిని ఎలా తొలగించుకోవాలి. లేదా ఎలా వాటిని గమనించాలి మరియు దోషాన్ని ఎలా పోగొట్టాలి ఇతరత్రా విషయాలను పాయింట్స్ రూపకముగా తెలుసుకుందాము. మొదటిగా ఈశాన్య స్థలములు, గృహముల గురించి తెలుసుకుందాము.**

64. దిక్కులలో ఈశాన్యం రాజు. కాన ఈశాన్య విషయములో జాగ్రత్తగా వ్యవహరించాలి. పొరపాటు చేయరాదు. రాజు సరిగా లేకపోతే రాజ్యము పతనము అవుతుంది. అలాగే ఈశాన్యం సరిగా లేకపోతే అందుండు వారు భ్రష్టు పట్టి పోవుదురు. ఒకటికి నాలుగు సార్లు ఈ విషయమును పదే పదే గుర్తుంచుకొని జాగ్రత్తలు తీసుకొన్నచో జీవనము బృహత్తరంగా గడిచి వంశం అభివృద్ధి పొంది సకల సౌభాగ్యాలతో సిరిసంపదలతో తులతూగుతారు.

65. గృహమునకు ఈశాన్య భాగమున మెట్లు వుండరాదు. అలా ఉన్నచో కొట్టి వేయడము మంచిది.

66. ఈశాన్య భాగమున పల్లము కలిగి వుండడం అదృష్టాన్ని కొని తెచ్చుకొన్నట్లే.

67. ఈశాన్య భాగమున అరుగులు వున్నచో వెంటనే కొట్టి వేయాలి. ఆలస్యం చేయరాదు.

68. ఈశాన్య భాగమున గుంత లేనట్లయితే వెంటనే ఓ గుండ్రటి గుంతను ఏర్పాటు చేసుకోవాలి.

69. ఈశాన్య భాగమున నడక వచ్చులాగున ద్వారములు ఏర్పాటు చేసుకోవాలి.

70. ఈశాన్య భాగమున ద్వారము వుండడం చాలా మంచిది. అది తూర్పు ఈశాన్యం కాని, లేదా ఉత్తర ఈశాన్యం కాని ఏదైనా సరే ఈశాన్య భాగములో ద్వారం వుండడం చాలా మంచిది.

71. ఈశాన్య భాగమున దిబ్బలు వుండడం జరిగితే వెంటనే తొలగించుకోవడం చాలా మంచిది, తక్షణ కార్యక్రమముగా దీనిని తొలగించుకోవడం చేయాలి. ఈ విషయంలో ఆలస్యం చేయడము వల్ల కొరివితో తలకాయను గోక్కున్నట్లే.

72. తూర్పు బాగము పల్లము కలిగి వుండడం మంచిది.

73. తూర్పు బాగమున బావి వుండడం మంచిది. ఏ తొందర లేదు.

74. తూర్పు బాగమున అరుగులు వున్నచో, ఈ అరుగులు ఇంటి యందలి గర్భముకన్నా ఎత్తుగా వున్నచో తగ్గించుకోవడం లేదా తొలగించుకోవడం చేయాలి.

75. తూర్పు బాగమున ఇంటికి ఎదురు వచ్చునట్లుగా మెట్లు వుండడం తప్పు.

76. తూర్పు ద్వారము ఉంచుకోవడం మంచిదే. నడక శుభకరము.

77. ఆగ్నేయభాగము పెరిగివుండడం తప్పు. తొలగించుకోవడం వెంటనే చేయాలి.

78. ఆగ్నేయ భాగము ద్వారా నడక రావడం చాలా తప్పు. తగిన జాగ్రత్తలు తీసుకొని ఈశాన్య నడక వచ్చులాగున చేసుకొన్నచో మంచిదని గమనించాలి. ఆగ్నేయ నడక అనేక రకాల వ్యవహారాలను తీసుకు వస్తుంది. మరీ మరీ గమనించాలి.

79. ఆగ్నేయ భాగములోని భూమి మట్టము నైఋతి కన్నా ఎత్తు కలిగి వుండరాదు.

80. దక్షిణ భాగము పెరిగి వున్నచో తొలగించుకోవడం చేయాలి.

81. దక్షిణ భాగమున కొళాయి గుంతలు గాని, పల్లము గాని వున్నట్లయితే పూడ్చివేసి అరుగులు నిర్మాణము చేయాలి.

82. దక్షిణ భాగము గుండా నీరు బయటికి వెళ్ళడం మంచిది కాదు. దక్షిణ ఆగ్నేయం ద్వారా నీరు బయటికి వెళ్లాలి.

83. గృహమునకు దక్షిణ నైఋతి ద్వారమున్నచో తొలగించుకోవాలి. వెంటనే ఆలస్యము చేయక ద్వారమును పూడ్చివేసి గోడను నిర్మించుకోవాలి. ఇటువంటి పనులు చేయునపుడు ప్రయాణము చేయడం నిషిద్ధము.

84. నైఋతి భాగములో ద్వారమున్నచో తొలగించుకొని అత్య ఆవశ్యకముగా గోడ నిర్మాణము చేసుకోవాలి. ఈ సమయంలో ప్రయాణము కూడా నిషిద్ధము. ఒక దినం ఆలస్యం చేయటము కూడా మంచిది కాదు. మరణ కారకము.

85. దక్షిణ నైఋతి, నైఋతి, పశ్చిమ నైఋతిల యందు గోడ నిర్మాణము చేయునపుడు ప్రయాణాలు చేయవద్దు.

86. నైఋతి పెంపు కలిగి వున్నచో చాలా చెడ్డది. పెంపు కలిగిన స్థలమును గృహమునుండి వేరు చేసుకోవడం చేయాలి.

87. పశ్చిమ భాగము పెంపు కలిగి వున్నప్పుడు దాన్ని తొలగించుకోవడానికి వీలు లేకపోతే భారీ వృక్షములను నాటుకోవడం, బలమైన రాతి అరుగుల నిర్మాణము చేయడం ఉత్తమమైన పద్ధతి. వీలైతే ఉపగృహము లేదా షెడ్డు వేసుకోవాలి.

88. వాయవ్యం విషయములో తగిన జాగ్రత్తలు తీసుకోవలసి వుంటుంది. ఇక్కడ అనుభవజ్ఞుల సలహాలు అవశ్యం.

89. ముఖ్యముగా వ్యాపారస్థులు వాయవ్య విషయములో జాగ్రత్తలు తీసుకొనకపోతే తరువాత కాలములో అనేక బాధలకు గురి కావలసి వుంటుంది. జీవితాంతము విచారించవలసి వుంటుంది. ఇది వ్యాపారులకు సాధారణ విషయము కాదు.

90. స్థిరత్వము కలిగిన గృహస్థులును అస్థిర పరిచి భ్రష్టు పట్టించే శక్తి వాయవ్య భాగమునకు కలదు.

91. సాధారణంగా ఎన్నో గృహాలకు వాయవ్యం పెరిగి వుండడం చూడవచ్చును. ఇది చాలా తప్పు. ఇటువంటి దోషాలను ఆలస్యము చేయక సరిచేయించు కోవడం చేయాలి. లేనిచో ఆర్థిక విషయాలలో ఇతరాత్రా బాధలకు గురి కావాలి.

92. ఉత్తరం ద్వారా నడక సాగడం అత్యుత్తమము.

93. ఉత్తరం పల్లమై వుండడం మహోత్తమము.

94. ఉత్తరం గుండా వాడుక నీరు బయటకు వెళ్ళడం అద్భుతము.

95. ఉత్తరం ద్వారం వుండడం బ్రహ్మాండము.

96. ఉత్తరం కుభేర స్థానము. ధనాదాయము, ఉత్తరం ఉత్తమం.

97. స్థలమును కొన్న తరువాత గృహమును నిర్మించుకోవడానికి ముందే ఆ స్థలముయందు ప్రహరీ గోడను నిర్మించుకోవడం సర్వదా శుభకరము, శ్రేష్టము. ఇది సరైన విధానము. అవలంభించాలి.

98. తూర్పు వీధి స్థలమైనచో ఈ ప్రాంతములో ప్రహరీ గోడకు తూర్పు మధ్యమునుండి ఈశాన్య ప్రాంతము వరకు గోడలు కట్టకుండా మిగిలిన అన్ని దిక్కుల యందు గోడ నిర్మాణము సాగించాలి.

99. ప్రహరీలో గృహమంతయు నిర్మితమైన తరువాత తూర్పు ఈశాన్య ప్రాంతములో ప్రహరీని గేట్లు మినహా మిగిలిన ప్రహరీని పూరించుకోవాలి. ఈ విధంగా చేయడము వల్ల గృహ నిర్మాణం తర్వాగా పూర్తి అగును.

100. పశ్చిమ, దక్షిణ ప్రాంత ప్రహరీ గోడలను చాలా ధృడముగా నిర్మించుకోవాలి.

101. దక్షిణ, పశ్చిమ గోడలను ఉత్తర, తూర్పు గోడలకన్నా చాలా ఎత్తుగా నిర్మించాలి.

102. బలమైన పరిసర ప్రాంత అవాస్తు దోషములను నివారించుకోవడానికి ప్రహరీ గోడ నిర్మాణము ఓ చక్కటి ఉపాయము.

103. మీ గృహమునకు దక్షిణ ప్రాంతములో పల్లమున్నను, గుంతలున్నను, బావులున్నను దక్షిణ ప్రహరీ గోడను బాగా ధృడంగా, బలంగా నిర్మించుకోవడం వల్ల ఆ దోషాలను హరిస్తాయి. ఎంత బలంగా నిర్మిస్తే అంత మంచిది.

104. మీ గృహమునకు పశ్చిమ ప్రాంతములో పల్లమున్నను, గుంతలున్నను, బావులున్నను పశ్చిమ ప్రహరీ గోడను బాగా ధృడంగా, బలంగా నిర్మించుకోవడం వలన ఆ దోషాలను హరిస్తాయి. ఎంత ధృఢంగా నిర్మిస్తే అంత శుభము.

105. ఈ ప్రహరీ గోడ వల్ల జరిగే ఇంకొక సత్ఫలితము ఏమంటే ఏదైనా చెడు వీధి పోటు గృహమునకు తగులుతున్నచో ఆ దోషమును ఈ ప్రహరీ గోడ చాలా భాగము అడ్డుకుంటుంది. ఇంకా ఇతర కీడు విషయాల్లో కూడా శుభం చేయును.

106. నైఋతి ప్రాంతముయందలి ప్రహరీ గోడ కూలినచో ఏమాత్రము అశ్రద్ధ చూపక ఒక్క క్షణము ఆలస్యము చేయకుండా తక్షణమే యుద్ధ ప్రాతిపదికన ఆ కూలిన ప్రాంతమును మరమ్మత్తు చేయించుకోవాలి. ఆలస్యము చేసినచో పాము కాటుకన్నా, ఎక్కువ ప్రమాదాన్ని రుచి చూడవలసి వుంటుంది. అజాగ్రత్త కాలకూట విషము కన్నా ఎక్కువ.

107. ప్రతి 10 అడుగులకు ఒక పిల్లర్‌ను వేసుకుంటూ మధ్యలో ప్రహరీని నిర్మించడం మంచి మార్గము. ఈ విధానం వల్ల ప్రహరీ ఎక్కువ కాలము ధృడంగా వుంటుంది. ఏదైనా ప్రకృతి విలయాలకు లేదా ఎక్కువ సంవత్సరముల సమయము గడచిన తరువాతను గోడ కూలడము అంటూ జరిగితే రెండు పిల్లర్ల మధ్య భాగము మాత్రమే గోడ కూలడము జరుగుతుంది. తద్వారా మరమ్మత్తు చేయించుకోవడం సులభము పైగా ఖర్చు చాలా తక్కువ అవుతుంది.

108. ప్రహరీ యందలి గృహము ముఖద్వారమునకు ఎదురుగా ప్రహరీకి గేటు వుండవలెను.

109. ప్రహరీ ఎత్తుకన్నను గేటు ఎత్తును పెంచుకోవడం వద్దు.

110. ప్రహరీ గోడ మందమునకు మధ్యలో గేటు రావడం ఉత్తమము.

111. తూర్పు వీధి గృహముల వారు ద్వారములను తూర్పు ఈశాన్యములో ఉంచడము వల్ల అనేక సత్ఫలితాలను పొందగలరు.

112. ఈ ద్వారమును తెరవడము అనేది ఉత్తరము ప్రక్కగా ఉన్న గడిని తీసి తలుపును తెరవాలి. ఇరుసు దక్షిణముకు ఉంటుంది. అనగా ద్వారమునకున్న దక్షిణ భాగము చెక్కకు తలుపును బిగించివుంటాము.

113. తూర్పు లేదా ఉత్తర ముఖద్వారము బేసి మట్టము లోపలి ద్వారముల బేసి మట్టముకన్నా పల్లముగా వుండడము మంచిది. అప్పుడు ముఖద్వారము గల గది పల్లమైనట్లే కదా!

114. దక్షిణ వీధి గృహస్తులు కొందరు ఉత్తర ఈశాన్యములో ద్వారము వుంచక కేవలం కిటికీలు వుంచి తృప్తి పడుతారు. సాధ్యమైనంతవరకు ఉత్తర భాగమున కిటికి కన్నా తలుపు బిగించుకోవడానికే ప్రాధాన్యత ఇవ్వండి.

115. ముఖద్వారము ఒక్కటి వాస్తురీత్యా బాగుందనుకోని తృప్తిపడి ఇతర ద్వారములను అశ్రద్ధ చేయకుండా వాస్తుకు సరిపోయే లాగున మాత్రమే ప్రతి ద్వారమును ఉచ్ఛ ప్రాంతములో మాత్రమే ఏర్పాటుచేసుకోవాలి.

117. గృహస్థులు ఉచ్ఛ నడకవల్ల భద్రతా బావము కలిగి ధనము బాగా కూడి ఆరోగ్యము చక్కగా వుండి ఆనందంగా జీవనము గడుపుదురు. తరాలు గడిచే కొద్దీ అనుకూలమైన సంతానము కలిగి కీర్తి ప్రతిష్టలు లభించును.

118. ప్రతి గదికి ఈశాన్య భాగముయందు ఏ బరువులు ఉంచకుండా ఖాళీగా ఉంచడము ప్రసస్తమైనది. ప్రతి గదికి ద్వారమును ఈశాన్య భాగములో వుంచడం వల్ల తప్పని సరిగా నడక ఈశాన్యమునకు సాగుతుంది.

119. గృహము యందలి ఈశాన్య గది విషయములో జాగ్రత్తలు బాగా తీసుకొన్న గృహస్థులు మంచి భవిష్యత్తును పొందగలరు.

120. దేవుని గదిలో ప్రతి దినమూ దీపం వెలిగించడము చాలా మంచిది. ఐదు రకాలు లేదా మూడు రకాల నూనెను కలుపుకొని ఒక సీసా లేదా ఒక డబ్బాలో ఉంచుకొని దీపం కొరకు నూనెను వాడుకోవాలి. భగవంతునికి శ్రద్ధతో పూలు మరియు పండ్లు సమర్పించుకోవడము మహోత్తమము. నిష్కల్మషమైన, నిర్మలమైన హృదయంతో, ప్రశాంత చిత్తముతో కనీసము దినమునకు రెండు నిమిషాలైనా భగవంతునికి కేటాయించండి. ఆ రెండు నిమిషాల సమయంలో ఇతర ఏ ఆలోచనలు లేకుండా చూసుకోవాలి. సాంబ్రాణి పొగ వేయడము ప్రసస్థము. దైవం తలుచుకుంటే ఏ క్షణంలోనైనా ఏమైనా జరుగవచ్చును అనే విషయములు మరువరాదు.

# గృహములో బరువులు ఉంచు పద్ధతి




పై పటమును గమనించండి. ఇది ఒక స్థలము యందు గాని, గృహము యందు గాని లేదా ఓ ఫ్యాక్టరీ యందు గాని బరువులనుంచు విధానము. పటములో పశ్చిమము మరియు దక్షిణము యందు పూర్తీ నల్లగా ఉన్న (**A** అను మార్కు గల) ప్రాంతములో ఎంత బరువులైనను ఉంచవచ్చును. ఉదాహరణకు ఇనుప బీరువాలు, చెక్క నిండు ఇనుముతో చేసిన మంచములు, పాత సామాన్లు, నీటి నిల్వలు (భూమి మట్టము కన్నా ఎత్తుగా గోళముల యందు ఉంచుకొన్నప్పుడు), బరువైన వాహనములు, పెద్దవారు పడక గదిగా ఉపయోగించుకోవడం, ఇతర గృహము యందు గల బరువైన వస్తువులను పై చూపిన మేరకు దక్షిణ పశ్చిమ, నైరుతి ప్రాంతముల్లో వుంచుకోవాలి.

వీటికి పై భాగములో **B** అని చూపించిన ప్రాంతాల యందు ఈ స్థలమునంతయూ కాస్త నలుపును తగ్గించి చూపించడమైనది. ఇందు పశ్చిమము, దక్షిణములో ఉంచిన బరువుల కన్ననూ కాస్త తక్కువ బరువులు గల వస్తువులను ఉంచుకోవచ్చును. ఉదాహరణకు బిందెలు, తపేళాలలో నీటిని నింపుకొని ఉంచుకోవడము, ఫర్నిచర్‌ను వేసుకోవడము, ఇతర బరువులను ఉంచుకోవడము.

ఇప్పుడు **C** ప్రాంతమును గమనించండి. గళ్ళు కలిగిన భాగము. ఇందు తక్కువ బరువులు గల వస్తువులను ఉంచుకున్నచో మంచిది. ఉదాహరణకు డైనింగ్ టేబుల్, బరువు తక్కువ గల వస్తువులను వుంచుకోవాలి.

**D** ప్రాంతమును గమనించండి. ఏటవాలు గీతలు వేసి చూపించడమైనది. ఈ ప్రాంతము యందు చాలా తక్కువ బరువులు గలిగిన వస్తువులను ఉంచుకోండి. ఉదాహరణకు టి.వి. ఎయిర్ కూలర్.

పటములో **E** ప్రాంతమును చూడండి. ఇది పూర్తీ తెలుపు రంగులో ఉన్నది. ఇక్కడ ఏ వస్తువునూ ఉంచుకోకపోవడం శ్రేష్ఠం. ఒకవేళ ఏదైనా వస్తువులను ఉంచుకున్ననూ చాలా తేలికపాటివి ఉంచుకోవడము శ్రేష్ఠము. ఉదాహరణకు ప్లాస్టిక్‌తో తయారైన తేలికపాటి కుర్చీలు తదితరములు.

## దిక్సూచి - వాడకం

దిక్సూచిని "నావిగేటర్" అని కూడా అంటారు. దిక్సూచిని ఈ ప్రపంచంలో ఎక్కువగా ఉపయోగించునది సముద్ర ప్రయాణాలు చేసేవారు. అయితే వీరి దిక్సూచి మన దిక్సూచిలా ఉండదు. సినిమాలు 2డి, 3డి అని ఎలా వస్తాయో అలాగే దిక్సూచిలో రెండు విధాలైన దిక్సూచిలున్నాయి. సముద్ర ప్రయాణంలో ఓడకు యంత్రముల గదిలో బిగించి ఉంటారు. ఓడను నడుపు నావికుడు (సెయిలర్) దానిని పదే పదే చూసుకుంటూ ఓడ ప్రయాణాన్ని సాగిస్తూ ఉంటాడు. వీరి దిక్సూచిలో భూగోళమంతయూ ఉండి ఓడ ఏ అక్షాంశము, రేఖాంశము దగ్గర ఉందో తెలుసుకునే సదుపాయము ఉంది. ఈ అక్షాంశము, రేఖాంశము అనునవి దాదాపుగా అందాజుగా ఉంటాయి. కానీ ప్రస్తుతం టెక్నాలజీ పెరిగినది. ఇప్పుడు స్పష్టంగా ఓడ ఎక్కడుందో గ్లోబల్ పొసిషనింగ్ సిస్టమ్ ద్వారా అత్యంత సులభముగా తెలుసుకోవచ్చు. వీరికి ప్రస్తుతం మనం వాడుతున్న సింపుల్ నావిగేటర్ పనికిరాదు. మనకు వారు వాడుతున్న నావిగేటర్ అవసరం లేదు, కొనలేము.

వాస్తు పుస్తకములో దిక్సూచి అను విషయం చాలా ప్రాముఖ్యత గలది. వాస్తు పుస్తకం అంతయూ ఒక ఎత్తు, ఈ దిక్సూచి విషయం మాత్రం ఒక ఎత్తు. కొందరు వాస్తు శాస్త్రవేత్తలు కూడా వారి పుస్తకముల యందు దిక్సూచి విషయం వ్రాయకపోవడం గమనార్హం. ఇది వారి తప్పు కాదు. వ్రాయడము సరిగా ఉన్ననూ చదువుకునే వారికి అర్థం కావడం కాస్త తికమకగా ఉంటే ఒకవేళ వారు పాటిస్తే ఇబ్బందులు వస్తాయని భావించి కొందరు వ్రాసి ఉండకపోవచ్చు.

ఏ వాస్తు శాస్త్రవేత్త అయినా స్థలము లేదా గృహమును చూడడానికి వెళ్లినప్పుడు తన దగ్గర దిక్సూచిని తప్పకుండా ఉంచుకొని ఉంటారు. దిక్సూచి లేకుండా స్థలమును చూడడానికి కూడా ఇష్టపడరు. ఇది నిజమే. మరియు సరైన పద్ధతే. దిక్సూచి లేకుండా స్థలమునకు లేదా గృహమునకు వెళితే దిక్కులు ఎటు ఉన్నాయో కేవలం యజమాని మాటను ఆధారం చేసుకొని ఫలితములు చెప్పవలసి ఉంటుంది. విదిక్కు స్థలముల యందు యజమానులు గుర్తించక ఇది తూర్పు ఇది ఉత్తరము అని భావించి ఉంటారు. అదే విషయమే వాస్తు శాస్త్రవేత్తకు కూడా తెలుపుతారు. ఆయన మాటను నమ్మి వాస్తు సవరణలకు పూనుకుంటే మొదటికే మోసం రావచ్చును.

దిక్సూచి చేతిలో ఉండడమే కాదు దానిని నేర్చుకోవడము చాలా నేర్పుతో కూడినది. ఎన్నో స్థల పరిశీలనలను కావిస్తే తప్ప దిక్సూచిపై ఒక ఐడియా రాదు.

కర్నూలు జిల్లాలో ఓ వాస్తు శాస్త్రవేత్త నన్ను కలవడం జరిగింది. నేనంటే ఎంతో అభిమానం చూపేవాడు. పదే పదే కలుస్తూ అభిమానంగా మాట్లాటడం వల్ల ఇద్దరి మధ్యలో చనువు ఎక్కువైనది. ఈయన వృత్తి **L.I.C** ఏజెంట్. ప్రవృత్తి వాస్తు శాస్త్రవేత్త. అయితే ముఖ్యులకు, కావలసిన వారికి మాత్రమే వాస్తు చూడడానికి వెళ్తారట. 8 సంవత్సరాలుగా వాస్తు చూస్తున్నానని తెలిపాడు. ఓ సారి మాటల మధ్యలో తను ఇండ్లకు వాస్తు సవరణలు సూచిస్తున్నా సరైన ఫలితములు సరిగా రావడం లేదని వాపోయాడు. సరిగా ఫలితములు లభించని గృహమునకు నన్ను పిలుచుకు వెళ్ళండి అని తెలపడంతో సరేనని నన్ను కొద్ది రోజుల తరువాత కర్నూలు పట్టణంలో ఓ ఇంటికి పిలుచుకు వెళ్ళాడు. అక్కడికి వెళ్ళిన తరువాత ఆయన దగ్గర దిక్సూచి లేకనే స్థలాలు చూస్తున్నారనే విషయం బయట పడింది.

ఆశ్చర్యపోయాను. ఆ గృహము విదిక్కు గృహము. ఇదే విషయమై ఆయనతో చర్చించాను. తనకు ఈ దిక్సూచి చూడడం రాదని, అది ఎలా చూడాలో కూడా నాకు సరిగా తెలియదని అందులో **"N"** అను అక్షరంనకు యారో మార్కు చూపించడం, ఇంత మాత్రమే తెలుసునని, యారో మార్కు ఎటు తిరిగితే స్థలము లేదా గృహము ఎటుపక్క ఎన్ని డిగ్రీలకు తిరిగి ఉన్నదో కూడా తను ఏ మాత్రము చెప్పలేనని, ఈ పీడ ఎందుకని దాని జోలికే వెళ్ళనని చెప్పాడు. ఆయన మాటలో నాకు అమాయకత్వం మాత్రమే గోచరించింది. తను చాలా పెద్ద తప్పు చేసి దొరికి పోయినట్లుగా నావైపు బిత్తర చూపులు చూస్తూవుంటే నాకెంతో జాలి అనిపించింది. ఆయనను కాస్త సున్నితంగా మందలించాను.

మనం చిన్న పొరపాటు చేసినా ఆ ఫలితాలను అనుభవించే గృహస్థుల బాధ చెప్పనలవి కాదు. మనం మంచి చేస్తున్న విధానం సరిగా ఉండాలి. మనవల్ల వెయ్యి మంది బాగుపడవచ్చు. కానీ ఒక్కరు కూడా నష్టపోరాదని చెప్పాను. ఇక ఎప్పటికీ ఇలా చేయవద్దని బోధించాను. దిక్సూచిని ఎలా చూడాలో వివరించాను. చిలక్కి మాటలు నేర్పిన నిదానమైన విధములో ఆయనకు దిక్సూచి గురించి వివరముగా సరళమైన భాషలో వివరించాను. ఏ కళనున్నాడో తెలియదు కానీ బాగా వంట బట్టించుకున్నాడు. ఇప్పుడు దిక్సూచి లేనిదే ఏ స్థలానికి వెళ్ళడం లేదు.

నార్త్‌పోల్, సౌత్‌పోల్ అని రెండు ధృవాలు ఉంటాయి. అయస్కాంతంలో ఒక దిక్కు ఎప్పటికీ నార్త్‌పోల్‌ను చూపిస్తూ ఉంటుంది. ఇదే విధానము అనుసరించి దిక్సూచిని తయారు చేస్తారు. అందుకే మనము ఒక స్థలంలో ఎటు గుండ్రంగా తిరిగినా, ఎటు పక్కకు పోయినా దిక్సూచి నార్త్ పోల్‌ను సూచిస్తూ ఉంటుంది. నార్త్‌పోల్‌ను దిక్సూచియందు **"N"** అను అక్షరంతో గుర్తించి ఉంటారు. నార్త్ పోల్ అయస్కాంత క్షేత్రము. నార్త్‌పోల్ పక్క విపరీతమైన ఆకర్షణ కలిగిఉంటుంది. అందుకొరకే పూర్వం నుండియే పెద్దలు మనలను ఉత్తరానికి తలనుంచి నిద్రించ రాదని బోధిస్తారు. ఉత్తరానికి ఆకర్షణ శక్తి ఎక్కువ.

ఇంతకీ వాస్తు శాస్త్రవేత్తలకు దిక్సూచి ఎందుకు?

దిక్కులు స్థలమునకు ఎటు ప్రక్క ఉన్నాయో గమనించడానికి తప్ప ఇక దేనికి దిక్సూచి పనికిరాదని చెప్పవచ్చు. స్థలమునకు దిక్కులు తెలిసన తరువాత దిక్కులు, మూలలలో ఈశాన్యము రాజు కాబట్టి **ఈశాన్యమును గుర్తించి**, తదుపరి సవరణలు సూచించడానికి ఈ దిక్సూచి చక్కగా ఉపయోగపడుతుంది. దిక్సూచిని బట్టి స్థలము $15^0$ పెరిగింది, $20^0$ తగ్గింది అని ఈ స్థలం మంచిదని, ఈ స్థలం చెడ్డదని చెప్పడం జరుగుతూంటుంది.

స్థలము కొలతలు పెరగడం, తగ్గడం ఉంటుంది. దిక్కులు, మూలలు పెరగడం తగ్గడం అనేది ఉండదు. ఈ విషయం వివరముగా తెలుసుకోవాలంటే 1, 2 పేజీల ద్వారా బోధించడానికి వీలుకాదు. నా సలహా ఏమంటే దిక్సూచి ద్వారా స్థలమునకు దిక్కులు ఎక్కడో గుర్తించండి. తదనంతరం మిగిలిన సవరణలు కావించండి. అంతేగాని దిక్సూచిని పట్టుకొని దీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చోవద్దు. ఇంతకు మునుపు ఊళ్ళ యందు దిక్సూచిలు లభించేటివి కాదు. వాస్తు పుణ్యమా అని ఎన్నో అంగళ్ళలో దిక్సూచిలు లభిస్తున్నాయి. వాస్తుపై అభిమానం ఉన్నవారే గాక చాలా మంది గృహస్థుల ఇళ్ళలో కూడా నేడు మనం దిక్సూచిని గమనించ వచ్చును. దిక్సూచి ఉంచుకోవడం పొరపాటు కాదు. దాన్ని పట్టుకొని వేళాడటం, స్థలము 10 డిగ్రీలకు 20 డిగ్రీలకు పెరిగిందని జుట్టంతా పీకేసుకోవడం దండగ. ఈ పుస్తకంలో ముందుగా దిక్సూచి విషయాన్ని చేర్చకూడదనుకున్నాము. కానీ రెండు వాక్యాలైనా వ్రాయాలని యోచించి వ్రాయడమైనది.

ముందుగా దిక్సూచి ఈ విధంగా ఉంటుంది. $0^0$ నుండి $359^0$ వరకు ఉంటుంది. $0^0$ నే $360^0$ గా

భావించాలి. కావున $0^0$ అయినా ఒకటే లేదా $360^0$ అయినా ఒక్కటే. $90^0$ లకు $180^0$ లకు $270^0$ లకు ఒక మార్కును చూపించి ఉంటారు. ఒక్కో ఫ్యాక్టరీ వారు ఒక్కో విధంగా దిక్సూచిని తయారు చేస్తారు. అయితే ఏ దిక్సూచి అయిననూ నార్త్‌నే సూచిస్తుంది.




పై విధంగా దిక్సూచి ఉంటుంది. విదిక్కు స్థలాలను గుర్తించడానికి ఈ దిక్సూచి అవసరం చాలా ఏర్పడుతుంది.




ఒక స్థలములో దిక్సూచిని ఉంచినప్పుడు ఇలా నార్త్‌ను చూపిస్తే స్థలం కచ్చితంగా $90^0$ లకు ఉందని భావించుకోవాలి. అదేం మహత్మ్యమో తెలీదు గాని శ్రీశైలం యందు ఎక్కడికి వెళ్ళినా స్థలములన్నియూ $90^0$ కే చూపిస్తుంటాయి. కేవలం తక్కువ వైశాల్యం కలిగిన ఒక్క ప్రాంతం మాత్రం విదిక్కు అయినది. ఇందులో నిర్మాణము ఎంత కష్టపడి చేస్తున్నా జరగలేదు. కారణం ఆ స్థలమునకు వెళ్ళిన వాస్తు శాస్త్రవేత్త దిక్సూచి చూడకుండా నిర్మాణం కావించడమే. ఆ స్థలం విదిక్కు అయినందువల్ల ఉత్తరముగా భావించి వాయువ్యములో ద్వారము ఉంచడం జరిగినది. తరువాత విదిక్కును గుర్తించి చేసిన దోషాన్ని చెప్పినందు వల్ల, పొరపాటును సరిచేసుకొని కట్టడమును పూర్తీ చేసుకున్నారు.

## మీ ఇల్లు బంగారం కావాలి

మీ ఇల్లు బంగారం కావాలి. అంతా మీ చేతుల్లోనే వుంది. చేసుకున్న వారికి చేసుకున్నంత మహదేవా. మీ ఇల్లు, మీ గృహం మీ స్వంతం. దాన్ని స్వర్గసీమగానైనా చేసుకోవచ్చు లేదా నరక కూపంగా మార్చుకోవచ్చు. అంతా మీ చేతిలోనే ఉంది. ఇంట్లో కుటుంబ సభ్యులపై అలగడం, విసుక్కోవడం, చిరాకుపడడం, కోపగించుకోవడం, చీదరించుకోవడం, పరుషంగా మాట్లాడడం, నిర్లక్ష్యం చూపడం, గౌరవ మర్యాదలు లేకుండా పోవడం, అశ్రద్ధ చూపడం వంటివి ఒకరి మధ్య ఒకరికి ఉంటే అది గృహాన్ని నరకకూపంగా మారుస్తుంది. దీనికి వ్యతిరేకంగా ఉండండి.

ఇంట్లో ఒకరిపై ఒకరికి ప్రేమ, ఆప్యాయత, అనురాగం, అభిమానం, శాంతి, సౌమ్యత కనబరిస్తే అన్ని విధాలా మీకు సమయం అనుకూలిస్తుంది. చెడు సమయం కూడా మంచి సమయం అవుతుంది. ధనం కూడుతుంది. సంఘంలో మర్యాద పెరుగుతుంది. అన్ని పనులు బాగా అవుతాయి. ముఖ్యంగా పిల్లలు మంచి అభివృద్ధిలోకి వస్తారు. మొదట్లో ఈ పద్ధతులు పాటించాలంటే చాలా కష్టమే. రాను రాను మీకు అలవాటవుతుంది, అనుభవమౌతుంది. ఇక జీవితంలో వదిలితేగా. సంతోషమంతా మీదే. ఆనందమంతా మీదే. అభివృద్ధి అంతా మీదే. పాఠకులు మగవారైతే మీ ఇంట స్త్రీలచే ఈ టాపిక్స్ గురించి చదివించండి. వారు ఎంతో ఆనందపడతారు. మరియు కుటుంబ అభివృద్ధిని కోరతారు.

పాఠకులు ఆడవారైతే మీ ఇంటి మగవారిచే ఈ టాపిక్స్ చదివించండి. వారిలో ఎన్నో మార్పులు వస్తాయి. మీ జీవితం ఆనందంగా సాగిపోతుంది. నరక కూపంలో ఉన్న ఇల్లు, స్వర్గసీమ అవుతుంది. ఒకరిపై ఒకరికి ఎంతో ఆప్యాయత, ప్రేమ ఉంటుంది. ఇవి చాలదా అభివృద్ధికి. శుభమస్తు. పరమేశ్వరుడు మీకు సదా తోడుండుగాక.

## మీ గృహం కళకళలాడాలి

మీ కుటుంబ సభ్యులలో మీకు తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు ఉన్నారా ! ఉంటే మీరు అదృష్టవంతులే. అసూయ, ద్వేషం, కోపం అనే మూడు గుణాలను వదిలివేస్తే ఇక మీ ఇంటిలో చూడాలి, కళకళ, గలగల, కిలకిల. ప్రతిరోజు ఒక పండుగ. మీ కుటుంబ సభ్యులను వదిలి మీరు ఇతర ప్రాంతాలకు వెళ్తే ఒక్క రోజు ఎక్కువ కూడా ఉండలేరు అక్కడ. ఎందుకు? మనసంతా మీ కుటుంబ సభ్యులు మరియు వారి నవ్వులు వారి అనుబంధాలు గుర్తుకొస్తాయి. దానితో మీరు మీ ఇంటికి తుర్రుమంటారు. అయితే ఈ కుటుంబానికి ఒక సమస్య ఉంది. అది ఏమంటారా! ఇతరులు కాస్తంటే కాస్త మీ ఇంటిని అసూయగా చూస్తారు. ఎప్పుడూ నవ్వుతుంటారే, హాయిగా ఉంటారే అని.

ఇక ఇంతకన్నా భాగ్యమా ! నేను ఈ విషయాలు చెప్పాక నన్ను ఎందరో అడుగుతుంటారు, మా ఇంట్లోని వారు ఇలాంటి వారు, అలాంటి వారు సార్. దుర్మార్గము, ఓర్చరు, అసూయ, ద్వేషం, కోపం, ఇంట్లో శాంతి లేదు. ఇట్లాంటి కొంపలో ఎలా సంతోషంగా ఉండమంటారు అని. దీనికి నా సమాధానం ఒక్కటే.

క్రిందనున్న చిత్రాన్ని గమనించండి.



కనీసం ఒక్క నిముషమున్నా పై చిత్రాన్ని గమనించాలి. అలా చూసి ఇలా చదువరాదు. ఇప్పటికైనా ఒక నిముష సమయం ఆ చిత్రాన్ని గమనించండి. మీకేమి అర్థమౌతోంది. మీ మనసులో ఏమి తోస్తోంది? ఇప్పుడు సరైనా సమధానం ఇక్కడ ఇస్తున్నాను. మీరు తప్పో, ఒప్పో మీరే నిర్ణయించుకోండి. మీ మనస్సులో

ఏముందో నేను ఎలా తెలుసుకోగలను? నేనెక్కడో మీరెక్కడో. మీ హృదయమే ఓ ధర్మాసనం. సమాధానం చదవండిక.

ప్రక్క చిత్రంలో నల్ల చుక్క బాగా కనిపించి, నల్ల చుక్క మాత్రమే మిమ్మల్ని ఆకర్షించి దృష్టి దానిపై మాత్రమే పెట్టివుంటే దోషము మీలో ఉంది. మీరు కాస్త కుటుంబ పరంగా మారాలి. ఒకవేళ నల్లచుక్క కాకుండా మిగతా చిత్రంలోని తెల్ల భాగము కనిపిస్తూ అది ఆకర్షించి ఉంటే మీరు దోషంలేని వారు. అలాగే మీ కుటుంబంలోని వారి (చిత్రంలోని నల్లచుక్కంతటి) చిన్న పాటి దోషాలను చూడకుండా పట్టించుకోకుండా (చిత్రంలోని తెల్ల స్థలమంతటి) గొప్ప మనస్సును, మంచి మనస్సును ఆదరించి వారిని సమయానుకూలంగా పొగిడి, అత్యంత అద్భుతమైన ఫలితాలను పొందండి. ఒక్కసారిగా ఈ ప్రయోగం ఫలించక పోవచ్చు. కాబట్టి పదే పదే ప్రయత్నిస్తుండాలి. తప్పకుండా విజయం మీదే అవుతుంది. ఇంటిలోని వారినికాక, బయటివారిని ఇష్టపడతామా. వారెవరండి బయటివారు, ఈరోజు ఉంటారు, రేపు వెళ్ళిపోతారు. అటువంటి వారిపై మీ కెందుకు ఆకర్షణ. జీవితాంతం చచ్చేంతవరకూ మీకు తోడు నీడ అన్నీ మీ ఇంటివారే. మీరు నష్టపోయినా, కష్టపడినా, ఆరోగ్యం దెబ్బతిన్నా ముందుగా పట్టించుకొనేది మీ గృహమందలి సభ్యులే. బయటివారు మాత్రం కాదు.

ఒకవేళ బయటివారు మీ ఇంటి సభ్యుల కన్నా మీపై ఎక్కువ ప్రేమను కనబరిస్తే అది తాత్కాలికం. ఎక్కువ సమయం ఉండనిది. లేదా మీ నుండి ఏదైనా ఆశిస్తూ కనబరచునదని మీరు బాగా గమనించాలి. ఈ జ్ఞానం మీకు ఎప్పుడు అబ్బుతుందో అప్పుడు మీరు విజయానికి చేరువైనట్లే. మీకింకా ఇది చదివికూడా ఏమీ తోచలేదంటే మీరు ఈ విషయాన్ని మరొకసారి చదవడం మంచిది. అప్పుడు మీకు అర్థమయ్యి విజయం ప్రాప్తిస్తుంది. ఇదంతయూ మీ మనస్సులోని మలినాన్ని తొలగించడానికి నేను చెప్పిన పదములు మాత్రమే. మార్పు అనునది మీ మనసులో రావాలి. అప్పుడే మీ ఇల్లు అభివృద్ధి చెందుతుంది, కళకళలాడుతుంది. ప్రతిదినం ఓ పండుగలా సాగుతుంది. ఏ మూర్ఖుడండీ ఇటువంటి అవకాశాన్ని కాలదన్నేది. ఎవ్వరికైనా గానీ తన ఇల్లు కళకళలాడలనే ఉంటుంది. మూర్ఖులకు మాత్రమే ఇల్లు శ్మశానంలాగా ఉండాలని తోస్తుంది. అటువంటి వారి గురించి మనకు అనవసరం. ఇక వాస్తు పరంగా ఇంటిని కళకళలాడేట్లుగా చేయవచ్చు. వాస్తు దోషాలు మీ గృహమునుండి తొలగించుకొన్న తరువాత మీ ఇల్లు తప్పని సరిగా కళకళలాడ వలసినదే. ఇది సత్యం.

వాస్తు మీ జీవితాన్ని మార్చే ఓ శక్తి. అందుబాటులో ఉన్న ఆయుధం. అడ్డమైన వారిని, ఏ మాత్రం అనుభవము లేని వారిని ఇంటికి పిలిపించుకొని వచ్చి ఇంటి వాస్తు చూపించి అనేక సవరణలు చేసి చేతులు కాల్చుకొని వాస్తును తిట్టడం, వాస్తు అస్సలు పనిచేయదని అదంతా మిథ్య, భ్రమ, డూప్ అని తిట్టుకుంటూ వాస్తు సవరణల కోసం ఉన్న సొమ్ము ఖర్చు పెట్టి, పైగా అప్పులు చేసి ఖర్చు పెట్టికూడా మధన పడి వేదన పడేదానికన్నా ముందుగానే ఎంత సొమ్ము అయినా ఫర్వాలేదు, ఓ మంచి అనుభవజ్ఞుడైన వాస్తు సిద్ధాంతిని మీ ఇంటికి పిలిపించుకొని తగిన సవరణలు చేయించుకొన్నచో మీకే గదా శుభం. మీకే గదా లాభం. ఇక్కడ ఒక ఉదాహరణ చెప్పుకుందాం.

కర్ణాటక యందలి మైసూర్ మహా నగరంలో జరిగిన ఓ సంఘటన. నేను నెలకు రెండు మూడు సార్లు మైసూరుకు వెళుతుంటాను. అక్కడ అనేక మంది వాస్తు విషయంగా నన్ను కలుస్తూ వారింటికి

పిలుచుకుని వెళ్ళి వాస్తు సవరణలు చేయించుకుంటారు. శివణ్ణ అనే వ్యక్తి వాస్తు చూపించుకొనే విషయమై నన్ను తన ఇంటికి పిలుచుకుని వెళ్ళారు. వీరు బట్టల దుకాణ వ్యాపారి. వీరింటి వాస్తు చూస్తుండగా, వీరి స్నేహితుడైన బసప్పగారు వచ్చారు. పరిచయాలయ్యాయి, మాటల మధ్యలో శివణ్ణతో బసప్పగారు నా ముందరే వాస్తు విషయంగా ఈ సిద్ధాంతిని ఆంధ్ర నుండి ఇంత భారీ ఖర్చు పెట్టుకొని ఎందుకు పిలిపించావు, కేవలం ఐదు వందలు లేక వెయ్యి రూపాయలు ఇస్తే ఇదే మైసూరు నగరంలో వందమంది వాస్తు చూస్తారు గదా! నేను కట్టబోయే ఫ్యాక్టరీకి మరియు కట్టబోయే ఇంటికి రెండింటికి కలిపి వేయి రూపాయలు మాత్రమే ఇచ్చాను. నీవు చేసిన పని బాగోలేదు అని కన్నడ భాషలో నిందించాడు. నాకు కన్నడ భాష సరిగా రాదేమోనని తలచినాడు.

నేను వెను వెంటనే బసప్పగారిని కన్నడ భాషలోనే రెండు ప్రశ్నలు వేశాను. దానితో ఆయన నా స్పష్టమైన కన్నడ భాష ఉచ్చారణను గమనించి నివ్వెరపోయాడు. మీరు ఆంధ్రావారా? లేక కన్నడవారా?అని అడిగారు. నేను అడిగిన ప్రశ్నలు రెండు. మీ ఫ్యాక్టరీ, ఇల్లు ఎక్కడ ? ఎంత ధనం వెచ్చించి ఫ్యాక్టరీ మరియు ఇల్లు కడుతున్నారు? దీనికాయన సమాధానం. ఫ్యాక్టరీకి మరియు ఇంటికి కలిపి 80 లక్షలు అవుతుందని తెలిపినాడు. వెంటనే మీ స్థల పరిశీలన మరియు మీ ఫ్యాక్టరీ, గృహ ప్లాన్లను నాకు చూపించగలరా ! అని అడిగాను. నాకు చూపించడానికి ఆయన ఇష్టత చూపలేదు. తరువాత శివణ్ణ గారు ఒకటికి రెండు సార్లు చెప్పడంతో మరియు బలవంతం చేయడంతో అయిష్టంగానే మమ్ములను మైసూరుకు 20 కి.మీ. దూరంలో ఉన్న వారి ఫ్యాక్టరీ స్థలానికి తన కారులోనే పిలుచుకుని వెళ్ళారు. ఫ్యాక్టరీ కాంపౌండుకు ఈశాన్య ద్వారం చూపుతూ ప్లాను ఉన్నది. ఈ ప్లాను నందు దోషాలు కలవు. అన్నిటికన్నా ముఖ్యమైనది పరిసర వాస్తును ఏ మాత్రమూ పరిగణనలోనికి తీసుకోలేదు. ఫ్యాక్టరీకి ఈశాన్య భాగంలో ఓ గుట్ట కలదు. గుట్టకు ఫ్యాక్టరీకి మధ్యలో దారి. ఫ్యాక్టరీకి పశ్చిమ భాగంలో ఏరు ఉంది. అందువెంట నీరు పారుతోంది. ఈ రెండు బలమైన దోషాలను ఆ వాస్తు సిద్ధాంతి పట్టించుకోకుండా ఫ్యాక్టరీ నిర్మాణానికి ప్లాను గీసి ఇవ్వడం నన్ను ఆశ్చర్యచకితుడిని చేసింది. ఈ విషయమై బసప్ప మరియు శివణ్ణ ఇరువురితోనూ ఉన్న విషయం ఉన్నట్లుగా కుండ బద్దలుకొట్టిన రీతిలో ఈ ఫ్యాక్టరీ నష్టాల పాలవుతుంది, అనేక ఆటుపోట్లకు గురవుతుంది. కొండకచో ఫ్యాక్టరీ ప్రారంభం కాకపోవచ్చు అని నేను చెప్పడం జరిగింది. బసప్ప ఉద్రేకాన్ని అప్పుడు నేను బాగా రుచిచూడడమైనది. శివణ్ణగారు వారిస్తున్నా వినకుండా బసప్ప నాపైకి వచ్చారు. ఇప్పుడే మా సిద్ధాంతిని పిలిపించి నీ తాడు తెంచుతానని మైసూరులో నీవు ఎప్పటికీ రాకుండా చేస్తానని సెల్‌ఫోన్ ద్వారా తన వాస్తు సిద్ధాంతిని అత్యవసరంగా, ఉన్నపళంగా రమ్మని, ఆంధ్రనుండి వచ్చిన వాస్తు సిద్ధాంతి కట్టబోయే ఫ్యాక్టరీ గురించి ఇష్టమొచ్చినట్లుగా పేలుతున్నాడు ఇతని విజ్ఞానాన్ని, అజ్ఞానాన్ని ఈరోజు కడగాల్సిందే. భారీగా డబ్బు దండుకోవ డానికి ఆంధ్రనుండి మన కర్ణాటక వచ్చారు. మీరేమైనా చేసుకోండి ఇక్కడున్నట్లుగా మీరు రావాలని ఆయనను అభ్యర్థించి తొందరపెట్టాడు.

గంటలోపుగానే ఆ సిద్ధాంతి వచ్చాడు. నేను చెప్పిన రెండు పెద్ద దోషాలను విని ఒక గంట సేపు గుక్క తిప్పుకోనికుండా కుంభవృష్టి వర్షం వలె గడగడలాడించాడు. నేను మధ్యలో కలగజేసుకుంటే నాపై కేకలు పెట్టాడు. ఏమి చెపుతున్నా వినడు. కొంగ ఒక కాలు ఎత్తింది. దానికి ఒకటే కాలు, రెండు కాళ్ళు లేవని నాతో వాదనకు దిగాడు. ఈ ఫ్యాక్టరీ వంద సంవత్సరాలు నిర్విఘ్నంగా నడుస్తుందని నీలాంటి చెత్త

సిద్ధాంతుల వల్లే వాస్తు కుంటుపడి పరువు పోగొట్టుకుంటోందని వాదించాడు. విజయగర్వంతో బసన్నగారు తన సిద్ధాంతి భుజాలు తడుతూ నాకు బాగా గడ్డి పెట్టావని మిడిమిడి జ్ఞానంతో శివణ్ణను కూడా ముంచాలని చూస్తున్నాడని తన సిద్ధాంతి తోడు ఉండగా నా ముందరే బాగా నూరిపోశాడు. నేను ఒక్కణ్ణి, వారు ముగ్గురయ్యారు. నా వాదన అరణ్య రోదన అయ్యింది. ఆఖరుకు నేను ఒక్కటే విషయం చెప్పాను. గట్టిగా "ఇక్కడ ఫ్యాక్టరీ కట్టవద్దు. భయంకరంగా నష్టపోతారు" అని గొంతు చించుకొని అరిచాను. ఎలాగైతేనేం అందరం శివణ్ణ ఇంటికి వచ్చాం. అక్కడికి వచ్చాక ప్రశాంత చిత్తంతో నేను వారికి తిరిగి విన్నవించాను. ఏం చెప్పినా వినరు. పైగా నాకు శాస్త్రజ్ఞానం లేదని నిందలొకటి. లోకల్ సిద్ధాంతి వాదన ఒక్కటే, ఫ్యాక్టరీకి గుట్టకు మధ్యన దారి ఉన్నందువల్ల ఈశాన్య భాగంలో ఉన్న గుట్ట ఏమాత్రం ఫ్యాక్టరీకి కీడు చేయదని పశ్చిమ భాగంలో ఉన్న ఏరు వల్ల ఏ దోషం లేదని పైగా ఈ రెండూ ఉన్నందువల్ల ఇంకా ఫ్యాక్టరీకి మంచి జరుగుతుందని వాదనకు దిగాడు. ఇలాంటివారితో ఎలా చచ్చేది. చెప్పితే వినరు. బాగుపడరు, బాగుపడనీయరు. 2002లో ఈ సంఘటన జరిగినది. ఇప్పటికీ కూడా ఆ ఫ్యాక్టరీ నిర్మాణం పూర్తి కాలేదు. శివణ్ణ మరియు బసప్ప గార్లు నన్ను కలిశారు. ఎలాగైనా ఫ్యాక్టరీని మొదలు పెట్టాలని, జరుగుతున్న భారీ నష్టాన్ని ఆపుకోవాలని. నాకు జరిగిన అవమానాన్ని గుర్తు తెచ్చుకొని వారిముందరే నిందించాను. నాకు జరిగిన అవమానం కన్నా వారు నష్టపోయినదే నాకు ఎక్కువ బాధ కలిగించిందని నేను వినయంగా తెలుపుకున్నాను. ఈ విషయంగా మీ సిద్ధాంతి ఏం చెప్పారు అని అడిగాను. అతను అయిపు, అజా లేదని తెలుపుకున్నారు. జరిగిన సంఘటన వల్ల నాకు ఎంతగానో కలిసివచ్చేట్టుగా చేసింది. ఏ సిద్ధాంతికైనా ఇటువంటి సంఘటనల వల్ల బాగా కలిసివస్తుంది. వారి బలవంతంపై ఫ్యాక్టరీకి వెళ్ళి తగిన సవరణలు సూచించి, చిన్న మార్పులు చేసి ముందుగ ఆ స్థలాన్ని, కట్టిన అర్ధ నిర్మాణాన్ని అమ్మించడం జరిగింది. ప్రియ పాఠకులారా ! గమనించారా 80 లక్షలు పెట్టుబడి పెడుతూ ఓ అనుభవజ్ఞుడైన వాస్తు సిద్ధాంతికి ఎక్కువ డబ్బు ఇవ్వాల్సి వస్తుందనే కక్కుర్తితో వారి తలపై వారే రాళ్ళు వేసుకున్నారు. ఇలాంటి అనుభవాలు మీకు వద్దు. మీకు నిజంగా వాస్తు చూపించుకోవాలని ఉంటే మీరు బాగా అభివృద్ధిలోకి రావాలని ఉంటే మంచి అనుభవజ్ఞుడైన వాస్తు సిద్ధాంతితోనే మీ గృహాన్ని, మీ ఫ్యాక్టరీలను, మీ స్థలాలను, ఇతరత్రా మీ ఆస్థులను పరిశీలింప చేయించుకొని చక్కటి ఫలితాలు పొందండి. అప్పుడే మీ ఇల్లు కళకళలాడుతుంది.

మీ ఇల్లు మీ స్వంతం. మీ ఇంటికి మీరే యజమానులు. మీరు బాగుండాలనే నా తలంపు. నా భావన. మీరు అభివృద్ధిలోకి వచ్చి, సంఘానికి, దేశానికి సేవ చేస్తే నేనెంతో సంతోషిస్తాను. ఏడుకొండలవాడు మిమ్మల్ని ఆశీర్వదించుగాక. విజయీభవ.

## ఫ్యాక్షనిజం - వాస్తు

రాతియుగం అయ్యింది. స్వర్ణయుగం అయిపోయింది. నేడు ఫ్యాక్షన్ యుగం. తండ్రిని చంపాడు, అన్నను చంపాడు, కొడుకును చంపాడని ప్రత్యర్థుల పీచమణు స్తుంటారు. ఎలాగోలా కాశ్మీరు విషయమై పాకిస్థాన్‌ను ఒప్పించి మంచి రాజీ మార్గం కుదుర్చుకోవచ్చుకానీ ఫ్యాక్షనిస్టులు మాత్రం పట్టిన పట్టు వదలరు. అనుకున్నది సాధించేంతవరకు పట్టుకున్న విషయాన్ని వదిలే ప్రసక్తే ఉండదు. అవతల ఎంత పెద్దవారైనా ఒక్కసారి తొడ కొట్టిన తరువాత ఇక వదలడమనేది అసాధ్యం. అవతల వాడో లేదో వీరో ఎవరో ఒకరు పోవాల్సిందే. ఎంత చెప్పినా చెవికేసుకోరు. అయితే చాలామందిలో నేడు మార్పులు వచ్చి పగలు, ప్రతీకారాలను ప్రక్కకు పెట్టి సంపాదనపై పడ్డారు. ఒకానొక నాడు ఫ్యాక్షనిస్టులకు కోటి లేదా రెండు కోట్ల ఆస్థులు మాత్రమే ఉండేవి. మరి నేడు వందల కోట్లు లేదా వేల కోట్లలో ఆస్థులు కూడబెట్టుకుంటున్నారు. చంపడం, చంపించడం అనేది ఓల్డ్ ఫ్యాషన్. నేటి ఫ్యాషన్ ఏమంటే ఊరిలో ఎంత భాగాన్ని కొన్నామనేది.

వీరు ఒక స్థలంపై మోజు పెట్టుకుంటారు. ఆ స్థల యజమానిని అమ్మమని అడిగి కోరినంత ఇవ్వడానికి వెనుకంజవేయరు. అలాకాదని ఆ యజమాని అమ్మక పోతే విషయం దిద్దుకు పోతే ఇక చూడాలి ఆ యజమాని తంటా. ఎక్కడికి పోయినా, ఎవరి దగ్గరకు పోయినా చివరికి ఫ్యాక్షనిస్టుకు మాత్రం ఆ స్థలాన్ని అమ్మాల్సిన పరిస్థితులు వస్తున్నాయి. వీరి అదృష్టం కొద్దీ ప్రభుత్వంలోని కొందరు అవినీతి పరుల ఆశకు ప్రజలు బలి అయి స్థలాలను వదులుకోవాల్సి వస్తోంది.

నాకు జరిగిన ఓ ఉదాహరణ చూడండి.

విశాఖపట్టణంలో నేను ఒకరికి వాస్తు చూస్తుండగా రాయలసీమ నుండి ఓ ఫ్యాక్షన్ నేత నాకు ఫోన్ చేసి తన గృహానికి వాస్తు చూసి తగిన సవరణలు సూచించ మని తెలిపారు. అయితే వారం వరకు నేను రాలేనని చెప్పడం, స్వతహాగా నాకు ఫాక్షన్ నేతలంటే ఇష్టం లేనందువల్ల చాలా అధికమొత్తమును నా ఫీజుగా చెప్పడం జరిగింది. ఎక్కువ మొత్తం చెప్పడం వల్ల ఇలాగైనా అయితే ఆయన నన్ను వదులుతారని ఇతరులచే వాస్తు చూపించుకుంటారని యోచన చేసి చాలా ఎక్కువ మొత్తం చెప్పాను. కనీసం నా ఫీజుకు ఆయన ఆలోచన కూడా చేయలేదు. అడిగినంత ఇస్తానని ఉన్న పళంగా బయలుదేరి రమ్మని తెలిపారు. భువనేశ్వర్‌లో ఓ ప్రోగ్రాంను ముగించుకు వస్తానని చెప్పినా వినకుండా ఉన్నపళంగా బయలుదేరాలి, మీరు కోరిన ఫీజు ఇవ్వడానికి సిద్ధపడ్డా ఇంకా ఎందుకు ఆలస్యం చేస్తారని రమ్మని కోరడం జరిగింది.

మనసు చంపుకొని వెళ్ళడానికి నిర్ణయించుకోలేదు. సరేనని ఊరకున్నాను. ఫ్యాక్షనిస్టుగా ! పట్టుకుంటే వదలడు. కచ్చితంగా 13 గంటల తరువాత నేనున్న లాడ్జీకి వారి మనిషి వచ్చాడు. ఆశ్చర్యపోవడం నా వంతైనది. మీది విశాఖపట్నమా అని అడిగిన నా ప్రశ్నకు కాదని, ఫ్యాక్షన్ నాయకుడు పంపాడని మీరు ఉన్నపళంగా బయలుదేరాలని, బండి తీసుకువచ్చామని తెలిపాడు. ఏమి చేయాలో నాకు పాలుపోలేదు. ఎందుకైనా మంచిదని ముందు కాఫీ తాగండని చెబుదామని లేచేలోపే వారి మిగతా మనుషులు బిరాబిరా రూంలోనికి చొరబడటం, నా లగేజీనంతనూ నా పర్మిషన్ లేకుండానే తీసుకుపోవడం జరిగింది. నేను రానని ఎంతగా చెప్పినా వినక బలవంతంగా నన్ను వెహికల్ దగ్గరకు తీసుకువెళ్ళారు. లాడ్జి బిల్లు కడతానని, ఆగమని చెప్పినా వినక క్షణంలో వారే లాడ్జి బిల్లు కట్టి వెహికల్ స్టార్ట్ చేశారు.

మనసు చంపుకొని వారితో వెళ్ళాలా! లేదా అబద్ధం చెప్పి తప్పించుకోవాలో నిర్ణయించుకొనేలోపే చేతులు పట్టుకున్నారు. సరే అయ్యిందయ్యిందని టాయిలెట్‌కు వెళ్ళొస్తానని చెప్పి లోనకు వెళ్ళాను. నక్షత్రకులు వదులుతారా! టాయిలెట్ బయటే కాచుకు కూర్చున్నారు. టాయిలెట్‌లో ఎక్కువ సమయం గడపలేక 15 నిముషాలకే బయటకు వచ్చాను. బయట సిద్ధంగా ముగ్గురున్నారు. ఇక తప్పదు. వెళ్ళాల్సిందే.

రాయలసీమకు ప్రయాణమై నాయకుని ఇంటికి చేరాను. అయితే నేను ఊహించినట్టుగా కాక ఆ నాయకుడు నన్ను సాదరంతో రెండు చేతులు పట్టుకొని ఆహ్వానించి మా మనుషులు ఏమైనా తమపట్ల పొరపాటు చేసివుంటే నన్ను చూసి ఏమనుకోవద్దని ముందుగా లోనికి పిలుచుకువెళ్ళి జీడిపప్పుతో, నేతితో చేసిన ఉప్మాను వడ్డించారు. వారి పట్టు వారిదే. నా పట్టు నాదే. నేను ఎక్కడా తిననుగా. అరగంట బతిమలాడినా తినలేదు. ఉల్లిపాయ ఆహారం నేను ముట్టను. చివరకు విషయం తెలిసి ఉల్లిపాయ లేకుండా చేయిస్తానని ఎంతగా చెప్పినా వినక నేను ఏ ఆహారమూ ముట్టనని నిర్భయంగా చెప్పాను. చివరకు రెండు పళ్ళను మాత్రము స్వీకరించడం జరిగింది.

నేను అనుకున్నదొకటి జరిగింది ఇంకొకటి. ఫ్యాక్షన్ నాయకులంటే ఎంతో క్రూర స్వభావమును కలిగి ఉంటారని, రాక్షసులుగా ప్రవర్తిసారని ఏదేదో ఊహించుకుంటూ ఉండేవాడిని. దీనికి బద్ధ వ్యతిరేకంగా ఆయనగారు ఎంతో ఆప్యాయతతో, నవ్వు ముఖముతో వినయంగా నా పక్కన నిలబడి మరీ నన్ను ప్రశ్నించడం, నా నుండి సమాధానాలు పొందడం నిజంగా మరిచిపోలేని సంఘటన. వారి ఇంటి ప్రోగ్రాము అయ్యింది. ఆయన పద్ధతి ప్రకారం నేను కోరిన ధనము పైగా 10,116/- తాంబూలములో 5 రకాల పళ్ళతో కలిపి ఇవ్వడానికి వచ్చాడు. నేను తిరస్కరించాను. ఇటువంటి ధనాన్ని ముట్టడానికి నా మనస్సు అంగీకరించదు. ఎంతగా ప్రాధేయపడినా నేను మాత్రం ఒక్కరూపాయి ముట్టనని రక్తం కూడు తిననని బాగా ధైర్యం తెచ్చుకొని చెప్పాను. ఆయనకు ఎంత కోపమొస్తుందోనని ఓ పక్క ఆలోచన వున్నా, ఇతరులను బాధపెట్టి దోచిన సొమ్మును నేనెప్పటికీ దక్షిణగా స్వీకరించడానికి ఇష్టపడను.

కష్టపడి సంపాదించిన సొమ్ము 10 రూపాయలుంటే ఇవ్వమని అది నాకు లక్ష రూపాయలతో సమానమని తెలుపగా ఆయన నిజంగా ఆలోచనలో పడ్డారు. దేనికంటే కష్టపడి సంపాదించిన సొమ్ము ఏమైనా ఉంటే కదా! చివరకు గంట అర్గ్యుమెంట్ తరువాత ఆయన ఒక స్థిర నిర్ణయం తీసుకొని ఒక నెలలోపుగా కష్టపడి సంపాదించిన సొమ్ము తమరికి పంపుకుంటానని తెలిపారు.

ఆయనకు మనుషులు, ప్రేమ, అనురాగాలు, ఆప్యాయతల గురించి వినయంగా హితబోధ చేసి, ఆయనలో క్రూర స్వభావం నశించడానికి వారింట వాస్తు అడ్జస్ట్‌మెంట్ చేసివుంటిని. నాకు ఏ కష్టమొచ్చినా ఎవరితో వ్యవహారమొచ్చినా తనను వెంటనే కాంటాక్టు చేయమని మిగతా విషయాలు అన్నీ నేనే చూసుకుంటానని చెప్పారు.

నాకు ఎవరితోనూ వ్యవహారాలుండవని ఆయనకు తెలిపి నేను తిరుగు ప్రయాణానికి సిద్ధమవుతుండగా ఒక్కటంటే ఒక్క పండు తమ తృప్తిమేరకు ఆరగించ మని కోరడం, ఒక కొబ్బరికాయ నీరు త్రాగి బయలుదేరగా వారే వారి వెహికల్‌లో నన్ను శ్రీశైలంలో దింపారు. ఎంత వద్దని చెప్పినా వినలేదు. నేను బయలుదేరే ముందుకూడా ఆ ఫ్యాక్షన్ నేత ఒక్క నెలలోపుగా కష్టపడిన సంపాదన ఎంతైనా సరే మీకు పంపుతానని మరీ మరీ తెలిపివుండెను.

కచ్చితంగా నెల తరువాత ఆయన నుండి నాకు ఫోన్ వచ్చినది. క్షమించండి. కష్టపడి సంపాదించడమంటే ఎంతో కష్టమనే విషయం అర్థమైంది. నిజంగా మీలాంటి వారితో పరిచయం కావడం నా అదృష్టమని ఇక

జీవితంలో ఎవరి నుండీ బలవంతంగా ఏదీ ఆశించనని సాధ్యమైనంతవరకు మీరు తెలిపిన విధంగా ధర్మ విధానాల ద్వారా సంపాదనకు పూనుకుంటానని తెలిపారు. దీనితో నేను ఆయన దగ్గరకు వెళ్ళిన పని సంపూర్ణమయినది. తృప్తిగా నిట్టూర్చాను. ఒక ఫ్యాక్షన్ నేతను మార్చడం జరిగింది. నా జీవితానికి నిజంగా ఇది ఓ అపురూపమైన కానుక.

**ఫ్యాక్షన్ నేతలకు మనవి :**

కష్టపడి సంపాదించడం ఎంత కష్టమో పై ఉదహరించిన ఓ యదార్థ విషయం ద్వారా మీరు తెలుసుకుని ఉంటారు. చదువుకున్నారు. ప్రపంచజ్ఞానం మీకు తెలిసి నంతగా ఇతరులకు తెలియకపోవచ్చు. సిద్ధాంతులకు ఎంతో మర్యాద ఇస్తారు. అసలు మీకు కోపం ఉందా అనేది కూడా తెలియకుండా ప్రవర్తిస్తారు. ఎంతో అభిమానం కురిపిస్తారు. అనుకుంటే ఏదైనా సాధించే మీలాంటి వారికి ఒక చిన్న మార్పు తేవడం కొరకై నా ఈ ప్రయత్నం. నేను చెప్పబోతున్న ఓ మాటను శ్రద్ధగా ఆలకిస్తారా ? కేవలం నెల అంటే ఒక్క నెల రోజులు మాత్రం మీ సంపాదనంతనూ పక్కన పెట్టి ధర్మ బద్ధంగా, న్యాయంగా ఎంత సంపాదించగలరో ముందుగా చూసుకోండి. మీ పౌరుషము, పట్టుదలలను న్యాయబద్ధంగా సంపాదన చేయు విషయంలో చూపించండి. ఈ దినం మీకు బలం ఉండవచ్చు. అలాగని ఇతరుల సొమ్మును అన్యాయంగా, అక్రమంగా దోచుకున్నచో రేపటి దినం పరిస్థితి ఏమిటి. మీకన్నా ఇంకొక బలవంతుడు సంఘంలో జనియించవచ్చు. అతని ముందు తట్టుకోలేనూ పోవచ్చు. ఆ బలవంతుడు మీరు అక్రమంగా సంపాదించిన ఆస్థులన్నింటినీ దౌర్జన్యంగా ఆక్రమిస్తే మీ మానసిక క్షోభ ఎంత భయానకంగా ఉంటుందో ఒక క్షణం నిదానంగా యోచన చేస్తే అప్పుడు మీకు కాలుతున్న పెనంపై చేయి పెట్టినట్లుగా ఒక్క ఉదుటున శరీరమంతయూ ప్రకంపిస్తూ భయభ్రాంతులకు గురి చేస్తుంది. దౌర్జన్యంగా సంపాదించిన మీకే క్షోభ కలిగితే ధర్మ సంపాదన చేసిన నిజమైన ఆస్థి యజమానికి ఎంతటి బాధను కలిగించి ఉంటారో ఒకసారి ఆలోచించరూ. ఇతరులను బాధ పెట్టి ఒక్క రూపాయి కూడా సంపాదన చేయవద్దు.

కష్టించి సంపాదించుకుకోవాలనే ఆలోచన మీ హృదయంలో మొలకెత్తినచో దైవానుగ్రహము లభించినట్లే. భగవంతుడు మీకు అన్నింటా మేలు చేయు గాక.

**సూచనలు :**

కొన్ని సూచనలు మాత్రమే మీకు తెలుపుకుంటున్నాను. మీరు మారి ధర్మ పద్ధతులలో నడిస్తే నేనెంతో సంతోషిస్తాను. దయచేసి గమనించండి.

1. నైఋతి దోషాలు లేకుండా జాగ్రత్త వహించాలి.
2. ఆగ్నేయము దోషము లేకుండా జాగ్రత్తలు తీసుకోండి.
3. తూర్పు ఎక్కువ ఖాళీ స్థలం వదులుకోవాలి.
4. పశ్చిమమున తూర్పు కంటే ఎక్కువ ఖాళీస్థలం ఉండరాదు.
5. ఈశాన్యములో గుంత తప్పనిసరి.
6. మీ ఇంటి వెనుక పశ్చిమము, నైఋతి, దక్షిణముల యందు ఖాళీ స్థలములు ఉండకుండా జాగ్రత్త వహించండి.
7. చెడువీధిపోట్లు లేకుండా జాగ్రత్త వహించాలి.

8. ఈశాన్యములో బరువులుండకుండా చూసుకోవాలి.

9. ఈశాన్యము తెగకుండా తూర్పున గృహానికి వాలువసారా వేసుకోవడం చాలామంచిది.

చివరిగా ఓ ఫ్యాక్షన్ నేతతో జరిగిన అనుభవాన్ని చూడండి. నేను సాధారణంగా ఎక్కువ కాలము కర్నాటకలో ఉండడము జరుగుతుంటుంది. ఓనాడు నేను మైసూరు మహానగరంలో ఉండగా ఆంధ్ర రాష్ట్రంలో ఫ్యాక్షనిస్టులకు పేరు పొందిన రాయలసీమ యందలి ఓ ఊరి నుంచి నాకు ఒక ఫోన్ కాల్ వచ్చింది.

మేము ........ ఊరి నుంచి మాట్లాడుతున్నాము. నీవు సురేష్ సిద్ధాంతేనా. నేను అవునన్న తర్వాత వారు "మా ఊరికి వాస్తు చూడటానికి నీవు రావాలి. మాది రాజకీయ కుటుంబము (వారు ఫ్యాక్షనిస్టులమని చెప్పలేదు). మా గృహమును వాస్తు శాస్త్ర రీత్యా సవరించాలి అని తెలిపి, ఎన్ని రోజుల్లో వస్తావు అని అడిగారు (సాధారణంగా మనం ఇతరులతో మాట్లాడుతున్నప్పుడు మీరు అని సంభోదిస్తాము. కానీ ఇక్కడ వీరు నీవు.. నీవు.. అని సంబోధించడాన్ని గమనించారు కదూ!). అప్పుడే నాకు అనుమానం మొదలైంది. సాధారణంగా పద్ధతులు తప్పిన వారు ఎదుటివారికి గౌరవాన్ని ఇవ్వరు. నా అనుమాన నివృత్తి కోసం మీరు ఫ్యాక్షనిస్టులా అని అడిగాను. ఔనని చెప్పారు. ఇక నేను క్షణాలలో ఆలోచించి ఓ నిర్ణయం తీసుకొని ఇప్పటిలో సమయం లేదు, మూడు నెలల తర్వాత వస్తానని చెప్పాను. అలా కాదు ఒక వారం లోపుగా రావాలని వారు కోరారు. కుదరదని చెప్పాను. ఇంకేం రావాల్సిందేనని పట్టుబట్టాడు. సరే చూద్దామని అంతటితో ఈ సంభాషణను వదిలేశాను.

వారం గడిచిన తర్వాత తిరిగి వారి నుంచి నాకు ఫోన్ వచ్చింది. ఇంకో వారం గడువు కావాలని కోరాను. ఇక వారి పంతం పెరిగింది. మేము పిలిచినా కూడా రావా! మేము ఎవరనుకుంటున్నావో నీకు తెలుసా! నీవు కోరినంత ఇస్తామన్నా కూడా రావా! రేపు వస్తున్నావు అని ఫోన్ పెట్టేశారు. నేను కూడా రాయలసీమ వాడినే. ఇక మనస్సులో ఓ నిర్ణయం తీసుకున్నాను. ఎటువంటి పరిస్థితుల్లోనూ గౌరవం ఇవ్వని వారి గృహాన్ని పరిశీలన చేయరాదు. ఒకవేళ బలవంతంగా పిలుచుకు వెళ్లినా వారి గృహానికి వాస్తు సవరణలు చూపించరాదు అని నిర్ణయించుకొని నా పని నేను చేసుకుంటున్నాను. మరుసటి దినం ఉదయం నేను బెంగుళూరులో ఉండగా, ఓ లోకల్ కాల్ వచ్చింది. మేము వాస్తు చూపించుకోవాలి మీరు ఎక్కడున్నారో తెలపండని చాలా గౌరవమిస్తూ ఓ కంఠం అడగడంతో నేనున్న లాడ్జి పేరు చెప్పాను. ప్రస్తుతం గదిలోనే వున్నారా అని అడిగారు. ఔననడంతో సరే వచ్చి మాట్లాడుతామని ఫోన్ పెట్టేశారు. సరిగా 40 నిమిషాల తర్వాత బిల బిలమంటూ నేనున్న గదిలోకి 6 మంది జనం వచ్చేశారు. రావడం రావడం నన్ను నోరు మెదపనియ్యక అయ్యగారు పిలుస్తున్నారు రమ్మని ఎంత చెబుతున్నా వినక బలవంతంగా గది ఖాళీ చేయించి వారి వాహనంలోనే వారి ఊరికి పిలుచుకు వెళ్లారు. మనసంతా చేదుగా తయారైంది. చివరికి సిద్ధాంతుల జోలికి కూడా ఫ్యాక్షనిస్టులు రావడం చాలా బాధకు గురి చేసింది. వారి ఊరికి వెళ్లడం, అక్కడ వారి నేతతో మాట్లాడటం నేను వాస్తు చూడనని తెలపడం, నన్ను ఓ గదిలో ఉదయం నుంచి సాయంత్రం వరకు బంధించడము జరిగినది. వారికి కావలసింది నాతో వాస్తు చూపించుకోవడము కాదట. పిలిచినా రానందుకు వారం దినాలు గదిలో బంధించాలని వారి నేత నిర్ణయం తీసుకున్నాడట. నన్ను గదిలో బంధించాక ఇక ఏమాత్రం తాపత్రయం పడకుండా పశ్చిమ గోడకు ఆనుకోకుండా నైరుతి భాగములో కూర్చొని పద్మాసనం వేసుకొని దైవధ్యానం చేసుకోసాగాను. దాదాపుగా రెండు గంటల సమయం గడిచిన తర్వాత అలాగే నిద్ర పోయాను. నిండా మునిగిన వాడికి చలి ఏమిటి. నేను ఏమీ తప్పు చేయలేదు. అనవసరంగా నన్ను

బంధించారు. అనుభవిస్తారనుకొని ఏ తాపత్రయం, కంగారు లేక ఉంటిని. సాయంత్రం గది బయట చాలా గట్టిగా కేకలు వినిపిస్తున్నాయి. నేత తల్లి అందరిని దండిస్తున్నది. ఏమి మాట్లాడుకున్నారో తెలియదు. వెంటనే గది వాకిలి తెరిచి ఆ నేత జనని నాకు చేతులెత్తి నమస్కరించి అయ్యా! వీళ్లు మూర్ఖులు. జరిగిన తప్పిదాన్ని పెద్ద మనస్సు చేసుకొని క్షమించి ఇక్కడి నుంచి దయచేసి వెంటనే వెళ్లిపోండి అని తెలిపి వాహనం సిద్ధం చేయించి తను కూడా వాహనంలో ఎక్కి ఊరి పొలిమేరల వరకు వచ్చి నన్ను బస్సులో కూర్చుండబెట్టి చేతిలో డబ్బు ఇచ్చేందుకు ప్రయత్నం చేసెను. గౌరవంగా నేను తిరస్కరించి ఆవిడకు చేతులెత్తి నమస్కరించి బస్సు ఎక్కాను. ఇదంతా జరిగినప్పుడు నేత అక్కడ లేడు. సమయం చూసుకొని అతని తల్లి నన్ను విడిపించింది. మరుసటి దినం ఉదయం నేత మాట్లాడుతూ బ్రతికిపోయావ్! ఇక నీవు చేసిన దానికి, నేను చేసిన దానికి చెల్లు అని అన్నాడు. నేను ఏమీ మాట్లాడక నిశ్శబ్ధంగా ఉన్నాను. అనవసరంగా వీరితో మాటలు పెంచుకోవడం నాకు సుతరామూ ఇష్టము లేదు.

ఇది జరిగిన నెల రోజుల తర్వాత ఇదే ఫ్యాక్షన్ నేత నాకు ఫోన్ చేసి మీ మనస్సు నొప్పించిన దానికి మరియు మిమ్ములను అనేక విధాలా ఇబ్బందులు పెట్టిన దానికి ఇప్పుడు ఫలితం అనుభవిస్తున్నాను. "మీరు" మా గృహమును చూడకపోయినా ఫర్వాలేదు. దయచేసి మా అతిధి మర్యాదలను, ప్రీతితో మేము ఇచ్చే రుసుమును కాదనక తీసుకోవలెను. "మీరు" ఎక్కడ వున్నా దయచేసి రావలెయును. లేదా కారు పంపమంటే పంపుతాను. తప్పనిసరిగా "మీరు" మా గృహానికి విచ్చేయవలసినదే...

నిజాయితీని, ధర్మాన్ని వాస్తు శాస్త్రవేత్త పాటించాలి. ఎన్ని అడ్డంకులు వచ్చినా ఆ ధర్మమే మనను కాపాడుకుంటుంది. ఫ్యాక్షన్ నేత కాదు ఎవరు వచ్చినా ధర్మాన్ని ఎదురించు శక్తి అసాధ్యము. ఆయనకు ఏం జరిగిందో నాకైతే తెలియదు. చివరకు పులి పిల్లి అయ్యింది.

## గౌరవనీయ ప్రభుత్వాలకు విజ్ఞప్తి

ఉమ్మడి ప్రజలు కలిస్తే సంఘం అవుతుంది. అటువంటి కొన్ని సంఘాలు కలిస్తే సమాజమవుతుంది. సమాజాల నిర్వహణకు కొందరు నిర్వహాకులు కావల్సి ఉంటుంది. వీటికి ప్రభుత్వాలు ఏర్పడాలి. ఈ ప్రభుత్వం యందు పనిచేయు వారే సంఘ నిర్వహణ బాధ్యతను చేపడతారు. వీరు ప్రతి ఒక్కరి శ్రేయస్సును కోరవలసి ఉంటుంది. మెజారిటీ ప్రజలు కలిసి ఏర్పాటు చేసుకున్నదే ప్రభుత్వం. కాబట్టి ప్రజలందరూ ప్రభుత్వం పట్ల బాధ్యతను కలిగి ఉండాలి. అవసరమైన సమయాలలో ప్రభుత్వానికి తగిన తోడ్పాటును ఇవ్వవలసి ఉంటుంది. ఇది ప్రజలందరి బాధ్యత. నా బాధ్యతగా :

గౌరవనీయ ప్రభుత్వాలకు విజ్ఞప్తి ఏమనగా ప్రభుత్వము, ప్రభుత్వ సంస్థలు, ప్రభుత్వ ఆఫీసులు బాగుంటే ప్రజలందరూ సుఖపడుదురు. ప్రాంతమంతయూ, రాష్ట్రము, దేశమంతయూ అభివృద్ధి అగును. మన రాష్ట్రాలు, మన దేశం. మనకు అభివృద్ధి చేసుకోవాల్సిన అవసరం మనకుంది. వాస్తురీత్యా నిర్మాణాలు లేని ఏ సంస్థ అయినా అనేక ఆటుపోట్లను ఎదుర్కోవలసి ఉంటుంది.

నేను వార్తాపత్రికలకు వ్రాసిన ఆర్టికల్స్ యందు, క్యాలెండర్ వెనుక వ్రాసిన వాస్తు వివరాల యందు ఎన్నో సార్లు వాస్తు రీత్యా కార్యాలయములను నిర్మాణం కావించమని ప్రభుత్వాలకు విన్నపం చేసుకోవడమైనది.

ప్రభుత్వ అధికారులు గృహములకు వాస్తు చూపించుకొని సవరణలు కావించుకుంటారు. వారు ఆఫీసులను కూడా వాస్తు రీత్యా సవరిస్తారని తెలిపితే నాకెందుకు ఈ తలనొప్పి. ఈ రోజు ఉంటాను, రేపు

ట్రాన్స్‌ఫర్ అవుతాను, నాకిదంతా అనవసరం అని ముఖము మొటమొటలాడిస్తారు. ఈ విషయాలు నాకు ఎన్నో సార్లు అనుభవమైనది. అయినా పెద్ద అధికారుల దగ్గరకు వెళ్ళి నప్పుడు నా బాధ్యతగా ఇప్పటికీ విన్నవిస్తూనే ఉన్నాను.

గౌరవనీయ ప్రభుత్వ అధికారులూ, ప్రభుత్వ ఆఫీసు అనగా తల్లి తరువాత తల్లి లాంటిది. తల్లి కుమారుని కడుపు మాత్రమే చూస్తుంది. అయితే ప్రభుత్వ ఆఫీసు మీ కుటుంబాన్నంతటినీ పోషిస్తున్నది. తల్లి కన్నా ప్రభుత్వ ఆఫీసు గొప్పదని చెప్పవచ్చును. మీ ప్రభుత్వ ఆఫీసులకు నేను ఏ మాత్రమూ సంబధించిన వాడిని కాదు. అయిననూ ఉత్సాహంగా, ఉచితంగా వాస్తు చూడడానికి సదా సిద్ధముగా ఉంటాను. మీ ఇళ్ళకు ఎంత ప్రముఖ్యత ఇచ్చి వాస్తు చూపించుకుంటారో అంతే ప్రాముఖ్యతను ఇచ్చి ఆఫీసులకు కూడా వాస్తు చూపించుకోవడం ద్వారా ఉద్యోగస్తులందరూ ఉత్సాహంగా పనులు నిర్వర్తించి ప్రజల బాగోగులను పూర్తీగా పట్టించుకొని ఆఫీసుకు సంఘము నందు ఒక మంచి పేరును తీసుకు వస్తారు.

కార్యాలయమునకు కార్యాలయాధికారియైన మీకు, ప్రతిష్ట పెరుగుతుంది కదా. అన్నిటికన్నా ముఖ్యంగా మీ ఇంటిల్లిపాదినీ  ఆర్థికంగా ఆదుకుంటున్న కార్యాలయమునకు న్యాయం చేసిన వారవుతారు.

మరొకసారి నా విజ్ఞప్తిని గమనించండి. నేను ప్రభుత్వ భవనాలకు, కార్యలయాలకు, ప్రభుత్వానికి సంబంధించిన ఏ నిర్మాణమునకైనా ఉచితంగా వాస్తు చూస్తాను. మా తాత గారు స్వాతంత్ర్య సమరయోధులు. దేశం కోసం తెల్ల కుక్కలతో పొట్లాడి 2 సం॥ 3 నెలలు జైలులో ఉండిరి. నాకు ఈ దేశం పైన విపరీతమైన ప్రేమ ఉన్నది. ఏదో ఒక మంచి కార్యము చేయాలని తలపోస్తున్నాను. నేను సిద్ధంగా ఉన్నప్పుడు మీరు ఆలస్యం చేయడం భావ్యం కాదుకదా. నా వాస్తు సేవలు ఇంకా ఈ దేశం కోసం పోరాడిన స్వాతంత్ర్య సమర యోధులకు ఉచితంగా అందిస్తాను. దేశ భద్రతను కాపాడే సైనికులకు ఉచితంగా వాస్తు చూస్తాను. మీ సమస్య నాకు బాగా తెలుసు. అది ఏమిటంటే ప్రభుత్వ ఆఫీసులకు వాస్తు సవరణలు కావిస్తే ఆ ఖర్చు ఎవరు భరిస్తారు. ఇది అక్షరాలా మీకున్న ముఖ్యమైన సమస్య. నా విజ్ఞప్తి ఏమిటంటే ఈ సమస్యను మీరు పరిష్కరించి ప్రభుత్వ కార్యాలయాలకు తగిన సేవ చేస్తారని భావిస్తున్నాను.

## రక్తదానం చేయండి

ఆపస్సమయములో దెబ్బతిన్న వారికి, అవసరమైన వారికి రక్త దానం చేయండి. 18 సం॥నుండి 60 సం॥ వరకు ఆడగాని, మగగాని ఎవరైనా సరే ఆరోగ్యవంతులు రక్తదానం చేయవచ్చును. రక్తదానం చేయువారికి చర్మ వ్యాధులు, అంటురోగాలు, క్యాన్సరు, గుండెపోటు, పక్షవాతము ఇతర రోగాలు ఉండరాదు.  రక్తదానం చేసినందు వల్ల ఎటువంటి ప్రమాదమూ లేదు. పైగా ఆరోగ్యము కూడా మీరు రక్తాన్ని దానం చేసిన తరువాత కేవలం నెలలోపలే శరరీం కోల్పోయిన  రక్తంను తయారు చేసుకుంటుంది. మూడు నెలల లోపలే రక్త కణాలను ఇతరములను తయారు చేసుకొని ఇంకొక సారి రక్త దానం చేయడానికి సిద్ధ పరుస్తుంది. అయితే 3 నెలలకొకసారి రక్త దానం చేయవద్దని డాక్టర్లు చెప్తారు. ఇలా చేస్తే కాస్త నీరస పడడం తప్ప ఇంకేమీ కాదు. 5 నెలలకొకసారి ఆరోగ్య వంతులు రక్త దానమును నిరభ్యంతరముగా చేయవచ్చును. ఇప్పటికి నేను 19 సార్లు రక్త దానం చేశాను. మీరూ రక్తదానం చేయండి. ఏ ప్రమాదము లేదు. ప్రమాదములో ఉన్నవారిని కాపాడిన వారవుతారు. రక్తదాతలకు ప్రభుత్వం వారు తగిన ప్రోత్సాహము ఎక్కువ చేయవలసి ఉంటుంది.

## దయచేసి చెట్లు పెంచండి

వృక్షో రక్షతి రక్షితః . వృక్షాలను వనదేవతలని ఏ పుణ్యాత్ముడు అన్నాడోగాని ఆయనకు కోటి దండాలు. ఏం వాస్తో ఏమో, వృక్షాల పరంగా తలుచుకుంటే వాస్తు అంటే ఒక్కోసారి కోపము వచ్చే మాట వాస్తవమే. వాస్తు పేరు చెప్పి తూర్పు, ఉత్తర, ఈశాన్యములో ఉన్న వృక్షాలన్నిటినీ కొట్టివేస్తున్నారు. దీనికి ఇంకో మార్గం వెతుక్కోవడం చాలా మంచిది.

వాస్తు శాస్త్రజ్ఞులందరికీ నా విన్నపము. వాస్తుపేరు చెప్పి వృక్షములను కొట్టివేయడం సబబా. వృక్షమన్న ప్రాణమేకదా. చల్లని నీడనిచ్చును. తినడానికి పండ్లుఇచ్చును. కాలుష్యములను దిగమింగును. భూమికి చల్లదనమును ఇచ్చును. గృహమునకు కావాల్సిన చెక్క సామానంతటిని వృక్షములే కదా ఇస్తున్నవి. ఇంతలా మనకు అవి సేవలు చేస్తుంటే, ఎక్కడా వాటిని బ్రతకనీయకపోతే ఎలా? చల్లటి గాలినిచ్చును. రేడియేషన్‌ను తొలగించును. ఇంకా ఇతరత్రా లాభాలు చెట్ల వల్ల ఎన్నో మనము అనుభవిస్తున్నాము. తరువాత నిర్ధాక్షిణ్యంగా వాటిని నరికివేస్తున్నాము. నా వాస్తు శాస్త్ర అనుభవంలో ఇప్పటికి ఒక్కసారి మాత్రం కర్ణాటక యందలి గంగావతిలోని ఓ గృహముయందు ఈశాన్య భాగంలో ఉన్న చెట్లను కొట్టివేయవలసినదిగా గృహస్థునికి తెలిపి ఉంటిని. నా మాటను అనుసరించి ఆయన చెట్లను కొట్టివేయించెను. ఆ విషయం తలచుకున్నప్పుడల్లా మనసంతా చేదుగా ఉంటుంది. ఎంతటి పాపపు పని చేసానని ఇప్పటికీ బాధపడుతుంటాను. పచ్చగా చెట్లతో కళకళలాడుతున్న వారి ఈశాన్య భాగములో చెట్లు కొట్టివేయించి ఘోరమైన తప్పిదమే చేశాను. వాస్తురీత్యా ఈశాన్య భాగంలో బరువుండడం మంచిది కాదు. అలాగని చెట్లను కొట్టివేయించడం చాలా తప్పు. ఎప్పుడైతే నేను ఈ పని చేశానో నాలో పాప భీతి మొదలైనది. పది రోజులు నాకు ఏ ప్రోగ్రాము రాలేదు. వాస్తు చూడమని నన్ను ఎవరూ కోరలేదు. నాకు అదియే సరియైన శిక్షగా భావించాను. తరువాత వచ్చిన వానకాలంలో యాభై చెట్లను ఇతర ప్రాంతములో ప్రజలచే నాటించాను. అప్పటికి గాని నా హృదయ వేదన తీరలేదు.

గౌరవనీయ వాస్తుశాస్త్రజ్ఞులు, నేను అనుభవించిన బాధను, క్షోభను అర్థం చేసుకోండి. అటువంటి క్షోభ బుద్ధిమంతులు, తెలివిపరులు, గౌరవనీయులైన మీకు వద్దు.

ఈశాన్య భాగములో చెట్లు ఉన్న గృహముయందు మిగిలిన ప్రాంతములలో చెట్లను నాటినచో చాలును అను జ్ఞానము ఆనాడు లేకపోయినది.

ఆ తరువాత ఎన్ని ప్రోగ్రాములకు వెళ్ళిననూ ఇంతవరకూ ఒక చెట్టును కూడా కొట్టివేయించలేదు.

మహారాష్ట్రయందలి షొంగ్లీ యందు ఓ గృహస్థుని ఇంట కచ్చితంగా ఈశాన్య భాగములోనే నాలుగు చెట్లు ఉండేవి. ఆ గృహస్థునికి నేను ఓ సలహా ఇచ్చాను. మిగిలిన ప్రాంతమంతయూ చెట్లను నాటుకోమని తద్వారా ఈ దోషము ఏ మాత్రమూ మిమ్మల్ని ఇబ్బంది చేయక తొలగిపోవును అని చెప్పి గృహము యందు ఉన్న వాస్తు దోషములను తొలగించడానికి మార్గము చెప్పాను.

నేను చెప్పిన మాట తు.చ. తప్పకుండా ఆయన పాటించడం, మంచి ఫలితములు రావడం జరిగినది. ఇప్పటికీ ఆ గృహస్థుని ఇంట ఈశాన్యములో చెట్లు అలానే ఉన్నాయి.

గృహముయందు పశ్చిమ, దక్షిణ, నైఋతి భాగములయందు బలమైన వృక్షములు ఉండడం వల్ల గృహస్థునికి అధిక భద్రత ఏర్పడును. ఈ ప్రాంతంలో చెట్లు ఉన్నచో తూర్పు ఉత్తరముల యందు ఉన్న చెట్లను కొట్టి వేయవద్దు. అసలుకు ఏ చెట్టునూ కొట్టవద్దు. ఒకవేళ ఈశాన్యము భాగములో మాత్రమే చెట్లు ఉంటే మీకు వాస్తు దోషమని మనసు పీకుతుంటే, మిగిలిన భాగాలైన ఆగ్నేయ, వాయువ్య, నైఋతిల యందు వృక్షములు నాటుకోండి. అప్పుడు ఈశాన్య వృక్షం వల్ల వచ్చు దోషం పోతూ మీకు శుభం జరుగుతుంది.

ప్రహారీలో గృహమును నైఋతి భాగమున కట్టుకుంటాము. పశ్చిమ, దక్షిణ, నైఋతిల యందు స్థలము తక్కువగా వదులుకుంటాము. ఉత్తర, ఈశాన్య, తూర్పుల యందు స్థలం ఎక్కువగా ఉండునట్లు చూసుకుంటాము. ఈ విధంగా ఉండడం వల్ల చెట్లను పశ్చిమ, దక్షిణ, నైఋతిల యందు పెంచడానికి స్థలము ఉండదు. అలాగని చెట్లను పెంచుకోము. ఎక్కువ స్థలమున్న ఉత్తర, తూర్పు, ఈశాన్య భాగములో చెట్లను పెంచితే దోషమని చెట్లని పెంచము. మరి చెట్లు ఎలా పెరగాలి. ఎక్కడ పెరగాలి. ఉన్న స్థలమంతయూ వాస్తుపేరు చెప్పి చెట్లు కొట్టేస్తు ఉంటే వాహనముల వల్ల, ఫ్యాక్టరీల వల్ల వచ్చు కాలుష్యము ఎలా హరింపబడుతుంది ? ఆఖరికి మనకెందుకులే అనుకుంటే మన నెత్తి మీద రాళ్ళు పడక తప్పదు. ఇప్పటికే ప్రపంచ దేశాలు వాతావరణ కాలుష్య విషయంలో విపరీతమైన ఆందోళన చెందుతున్నాయి. ఎన్నో కోట్ల రూపాయలు చెట్ల కొరకు ఖర్చు పెడుతున్నాయి.

లండన్ యందలి గ్రీన్‌హౌస్ అసోసియేషన్ ప్రెసిడెంట్ మెక్‌గ్రాత్ మాట్లాడుతూ భారతదేశంలోని వాస్తువల్ల చెట్లకు వినాశనం చుట్టుకుంది. దీన్ని ఎవరో ఒకరు రూపు మాపాలని కోరడం చూస్తే మనము ఎంత జాగ్రత్తలు తీసుకోవాలో అర్థం చేసుకోవాలి.

ప్రియమైన ప్రజలారా, గౌరవనీయ పాఠకులారా చెట్లను పెంచండి. వాటి ఆశీర్వాదం మీకు ఉంటుంది. మీకు తప్పకుండా శుభం ఒనగూడుతుంది. వాస్తు పేరు చెప్పి చెట్లను కొట్టివేయవద్దు. ఒక్కసారి నేను ఈ పని చేసినందుకే ఇప్పటికీ బాధపడుతున్నాను. ఆ బాధ మీకు వద్దనుకుంటే చెట్లను మాత్రం దయచేసి కొట్టవద్దు. ఒకవేళ మీ గృహముల యందు తూర్పు, ఉత్తర, ఈశాన్య భాగంలో చెట్లు ఉంటే పరిష్కార మార్గం సూచిస్తాను. పాటించి చెట్లను కాపాడుకోండి.

1. గృహమునకు ఈశాన్య మూల తలుపులను ఏర్పాటు చేసుకుంటే గృహముయందు బరువులకు వ్యతిరేక స్థానములలో ఉన్న 5 చెట్ల దోషమును హరిస్తుంది.

2. ప్రహారీకి ఈశాన్య భాగమున గేటును ఏర్పాటు చేసుకున్నచో గృహము యందు బరువులకు వ్యతిరేక స్థానములలో ఉన్న 6 చెట్ల దోషమును హరిస్తుంది.

3. ఈశాన్యములో గుంత వేసుకోవడం వల్ల గృహములో బరువులకు వ్యతిరేక స్థానములలో 10 చెట్లు ఉన్ననూ వాటి దోషమును హరిస్తుంది.

4. పశ్చిమ, దక్షిణ, నైఋతి భాగములలో బలమైన నిండైన ఎత్తైన రాతి అరుగులను నిర్మించుకున్నచో గృహముయందు బరువులకు వ్యతిరేక స్థానములలో ఉన్న 11 చెట్ల దోషమును హరిస్తుంది.

5. గృహము మేడపైన నైఋతి మూలలో గదిని నిర్మించుకోవడం గాని, నీళ్ళ ట్యాంకును వేసుకోవడం వల్ల గానీ చేసినచో గృహముయందు బరువులకు వ్యతిరేక స్థానములలో ఉన్న 15 చెట్ల దోషమును హరిస్తుంది.

ఒకవేళ మీ గృహములో 2 చెట్లు మాత్రమే ఉంటే ! ఏ వాస్తు దోషమూ లేదు. నిశ్చింతగా గుండెలపై చేయి వేసుకొని హాయిగా నిద్రపోండి.

ప్రతి దినమూ చెట్లకు నీరు పోస్తుండడం వల్ల భగవంతునకు పూజ చేసి, నైవేద్యం పెట్టినంత పుణ్యము లభించును.

కొందరు గౌరవనీయ వాస్తుశాస్త్రజ్ఞులకు నేను చెప్పిన పై మాటలు సరిపోక పోవచ్చును. అయితే చెట్లు లేకపోతే మానవజాతికి విపరీతమైన కీడు జరుగును. మహనీయ వాస్తుశాస్త్రవేత్తలారా! గృహస్థుడు చెట్లను పెంచేవిధంగా వాస్తు శాస్త్రమును అభివృద్ధి చేద్దాము. మీ వంతుగా మీరు ప్రయత్నాలు చేయండి.

ఎన్నో అభివృద్ధి చెందిన గృహాలు, పల్లెలు, పట్టణాలయందు ఎక్కువగా చెట్లు ఉండడం గమనించడమైనది. ఎవరింటిలో ఐతే ఎక్కువ చెట్లు ఉంటాయో వారికి భద్రత బాగా ఉంటుంది. వారు ఉన్నత మనస్కులై ఉంటారు. వారి పిల్లలు చదువులో బాగా అభివృద్ధి చెందుతారు. ఏకసంద్యాగ్రాహులౌతారు. చెట్లు ఎక్కువ ఉన్న గృహముయందు మేధావులు ఎక్కువగా జనిస్తారు. అంతెందుకు మనకు దగ్గరనే కదా బెంగుళూరు, మైసూరు నగరాలనే తీసుకోండి. మనం ఊహించని విధంగా అభివృద్ధి చెందుతున్నాయి. అక్కడి మనుషులు ఎంతో నిదానముగా శాంతమూర్తులై ఉంటారు. కోపము చాలా తక్కువ. ఇతరులకు ఇచ్చు గౌరవము ఎక్కువ. వారు వ్యాపారములో బాగా సంపాదన చేస్తున్నారు. ఆనందంగా ఉంటున్నారు. చెట్లు ఉన్నచోట శాంతముంటుంది. చెట్లు లేకపోతే క్షామము, కోపము, ఉద్రేకము, కామము, ఇతరత్రా రాక్షస గుణములు చేరు అవకాశము ఎక్కువ.

చెట్లు బాగా ఉన్న గృహస్థులు శాంతంగా ఉండి ధనమును బాగా ప్రోది చేసుకొని ఉంటారు. అనుకోని విపత్కర ప్రమాదములు జరగడం ఉండదు. వీరికి మాట వినే పనివారు బాగా ఉంటారు. వీరి వాక్కు బాగా ఫలిస్తుంది. సమాజంలో వీరికి ఓ ప్రత్యేకమైన గౌరవము లభిస్తుంది. వీరి గృహమునకు ఏదో చెప్పలేనటువంటి ఆకర్షణ ఉంటుంది. తద్వారా శుభములు జరుగును. చెట్లు ఎక్కువగా ఉన్న గృహములకు దేవతలు వచ్చిపోవుదురు.

ఉత్తరము, తూర్పు, ఈశాన్యములయందు చెట్లు వేయగా పోయిన స్థలములో కుండీలను (కుంపట్లు) పెట్టుకోవచ్చును. పూల మొక్కలు వేసుకోవచ్చు. పచ్చిక బయళ్ళను తయారు చేసుకోవచ్చు. తోటలు వేసుకోవచ్చు.

మీ ఊరిలోనే మీ గృహముయందు ఎక్కువగా చెట్లు ఉన్నట్లయితే మీరు నాకు మిత్ర సమానమే. మీ గృహమునందు ఇతర వాస్తు దోషాలున్నాయని మీకు ఏదైనా అనుమానం ఉంటే నన్ను తప్పకుండా పిలవండి. నేను మీకు ఉచితంగా వాస్తు సలహాలను ఇవ్వగలను. చెట్లను పెంచినవారు దైవస్వరూపులు. భోళాశంకరుడు మిమ్మల్ని ఆశీర్వదించుగాక.